అపుడది అను క్రియాపదములోని నకార దకార ములతోఁ జేరిన ఉకారములకు లోపము రాఁగా, నకార దకారములకును దకార రేఫములకును సంధి వచ్చెను.

64. ఒక పదముయొక్క అంత్య వర్ణమునకును మఱి యొకపదముయొక్క ఆదివర్ణమునకును వచ్చెడు సంధి పదబహిస్సంధి.

ఉ. రాముఁడు + ఏగెను = రాముఁడేగెను.

పూర్వపదముయొక్క ఉకారమునకు లోపము రాఁగా దకారము ఏకార ముతో సంధిఁ బొందెను.

65. అక్షరస్వరూపమును బట్టి సంధి రెండు విధములగు.

స్వాభావికసంధి; వికారసంధి

స్వాభావికసంధి.—అక్షరములు స్వరూపభేదము లేక ఉన్నట్లే చేరుట.

ఉ. వచ్చెను రాముఁడు.
సూర్యుఁడు విలసిల్లె.

వికారసంధి—అక్షరము చేరునప్పుడు రూపభేదము కలుగుట. ఈసంధి మూఁడువిధములుగ నుండును.

ఆగమసంధి—క్రొత్తవర్ణములు ఆగమములుగా వచ్చెడు సంధి.

ఉ. రాముఁడు = రామడ్ + ఉ.

మాయత్త = మా + అత్త. యకారంబు ఆగమంబు.

వారు = అ. అవరు, అ + అరు. అ అనునది తచ్ఛబ్దార్థకమయిన సర్వనామము. అరు బహువచన ప్రత్యయము. వకారము ఆగమము.

తనువు = తను + ఉ
గోవు = గో + ఉ
కద్రువ = కద్రు + అ
} వకారము ఆగమము.

ధీరురాలు = ధీర + ఆలు.
గుణవంతురాలు = గుణవంత + ఆలు.
} రేఫము ఆగమము. పదాంతమైన అత్తునకు ఉత్వము.

పేదరికము = పేద + ఇకము. ఇచట రేఫము ఆగమము.

67. అకారమునకు అచ్చు పరంబగునపుడు అకారమునకు లోపమును యకారాగమమును వికల్పంబుగ నగు.

ఉ. మేనల్లుడు = మేనయల్లుడు = మేన + అల్లుడు.

పుట్టినిల్లు = పుట్టినయిల్లు = పుట్టిన + ఇల్లు.

68. స్త్రీవాచకములయొక్కయు తత్సమ సంబోధనాంతంబులయొక్కయు అంత్యాకారంబునకు లోపము లేదు.

ఉ. అమ్మయిచ్చెను = అమ్మ + ఇచ్చెను.

దూతయితడు = దూత + ఇతడు.

ప్రియుండడయేగెను = ప్రియుండడ + ఏగెను.

69. వ్యతిరేక క్త్వార్థకముయొక్క అంత్యాకారమునకు అచ్చు పరంబగునపుడు అల్లోపము విభాషనగు.

ఉ. చూడకయరిగెను=చూడకరిగెను=చూడక+అరిగెను.

70. ఉము, ఉండు, ఉ, ఉరె. ఈ ప్రత్యయములకు పూర్వము ప్రార్థనార్థక క ప్రత్యయముయొక్క అకారమునకు లోపము నిత్యము.

ఉ. చేయకుము. చేయకుండు. చేయకుఉ. చేయకురె.

చేయక—గ్రామ్యమందు ప్రార్థనార్థకము. అ శబ్దమునకు. దానికి మధ్యమపురుషమునందు ఉము, ఉండు, ఉ, ఉరె ప్రత్యయములు అధికముగా వచ్చినవి.

71. వేసాదిశబ్దములకు ఆలు శబ్దము పరము కాఁగా రేఫాగమంబు అగు.

| | | |
|---|---|---|
| ఉ. పేదరాలు | = పేద+ఆలు. | జవరాలు=జవ+ఆలు. |
| బీదరాలు | = బీద+ఆలు. | అయిదువరాలు= |
| ముద్దరాలు | = ముద్ద+ఆలు. | అయిదువ+ఆలు. |
| బాలెంతరాలు | = బాలెంత+ఆలు | మనుమరాలు=మనుమ+ఆలు. |
| కోమరాలు | = కోమ+ఆలు. | గొడ్డురాలు=గొడ్డు+ఆలు. |
| పేద-బీద. | అ. | పైదె=దరిద్రుఁడు, అశక్తుఁడు. |
| ముద్ద. | వం. | ముగ్ధ=అందగత్తె, తెలియనిది. |
| బాలెంత. | వం. | బాలవంత్=బిడ్డగలిగినది=ప్రసవించినది. |
| జవ. | | వం. యౌవ, యౌవనశబ్దతద్భవము; జవ్వని. |

72. తత్సమాకారాంత శబ్దములకు తుదియాకారంబునకు ఆలుపరంబగుచో ఉత్వంబును అగును.

ఉ. సమర్థురాలు=సమర్థ+ఉ+ఆలు.

బుద్ధిమంతురాలు=బుద్ధిమంత+ఉ+ఆలు.

పూర్వమాత్రమునకే రేఫాగమము.

73. సంబంధార్థక ప్రత్యయములయిన అకారేకారములకు అచ్చుపరంబగునపుడు లోపము లేదు యాగమము అగును.

ఉ. నా+ఇల్లు=నాయిల్లు.

నాయొక్కయిల్లు=నాయొక్క+ఇల్లు.

యొక్క అనునది షష్ఠీవిభక్తి ప్రత్యయము.—

అ, ఉద్దేశము అనుదానినుండి పుట్టినది. ఆ పదములో అకారము సంబంధార్థక ప్రత్యయము.

ఉ. వారియిల్లు=వారి+ఇల్లు.

వారలయిల్లు=వారల+ఇల్లు.

తనయిల్లు=తన+ఇల్లు.

మన, మా, మీ, నీ, నా, వారి, వారల, తన, తమ మొదలయినవి సంబంధార్థక ప్రత్యయాంతములు.

(సర్వనామప్రకరణము చూడు.)

74. మధ్యమపురుష క్రియల అంత్యేకారమునకు లోపంబగు.

ఉ. వచ్చితి విచ్చుటికి=వచ్చితివి+ఇచ్చుటికి, వచ్చితిరిచ్చుటికి=వచ్చితిరి+ఇచ్చుటికి.

75. ప్రథమోత్తమపురుష క్రియల అంత్యేకారమునకు లోపము వైకల్పికము.

ఇత్తు[illegible] వె[illegible] [illegible] ఇ లోపంబులేనియెడల యాగమంబు బహుళంబు[illegible].

అదియేమి }
అదేమి } = అది+ఏమి.

అవియేవి }
అవేవి } = అవి+ఏవి.

మఱియెవ్వఁడు }
మఱెవ్వఁడు } = మఱి+ఎవ్వఁడు.

చేయయిచ్చెను = చేయ+ఇచ్చెను.

చేయనియెడల = చేయని+ఎడల.

ఇచ్చట యకారము ఆగమముగా వచ్చుటకు కారణము ఇకారము తాలవ్యమగుటయే. ఇట్లే ఉత్తునకు పరముగా అచ్చు వచ్చునపుడు దానికి లోపము లేనియెడల వకారము ఆగమమగును. ఇట్లు స[illegible]గమము[illegible] నియమము అకారాకారములకు లేదు అచ్చులకు మధ్యమైన సంధియందు య వ ర అ న ల ఆగమములగును. వీని లో తఱచుగా వచ్చునవి యకార వకారములు ఈవిధి ఇకారోకారములకు వెనుక నిత్యము. పదాంతస్సంధియందు త. ఇవర్, తె. వీడు, త. ఎవర్, తె. ఎవరు అనుపదములందు వకారము సూత్రవిరుద్ధముగా [illegible] మునందు ముందువచ్చి తెనుఁగునందును కలిగియున్నది.

76. ఉత్తునకు అచ్చుపరంబగునపుడు లోపంబగును.

వాఁడేగెను = వాఁడు + ఏగెను.
పుష్పంబులారెను = పుష్పంబు + ఆరెను.
చేయుక = చేయుఁ + అ + క.

పదాంతసంధియందు ఉత్తున లోపము లేనియెడ వకారము ఆగమమగును.

తరువు = తరు + వ్ + ఉ.
విష్ణువు = విష్ణు + వ్ + ఉ.
గోవు = గో + వ్ + ఉ.

ఉకార వకారములు ఓష్ఠ్యములగుటచే సవర్ణములు, కాఁబట్టి ఉకారమునకు పరంబుగ వకారాగమము వచ్చునది.

70వ విధి చూడుము.

77 ప్రథమావిభక్త్యంతములకు పరములైన పరుషములకు గ స డ ద వలు బహుళముగా నాదేశంబు లగును.

ఉ. రాజు+కొట్టెను=రాజుగొట్టెను, రాజుకొట్టెను.
కృష్ణుఁడు+చూచెను=కృష్ణుఁడు సూచెను, కృష్ణుఁడు చూచెను.
రావణుఁడు+టక్కరి=రావణుఁడుడక్కరి, రావణుఁడుటక్కరి.
భృత్యుఁడు+తెచ్చెను=భృత్యుఁడు దెచ్చెను, భృత్యుఁడు తెచ్చెను.
రాముఁడు+పలికెను=రాముఁడువలికెను, రాముఁడుపలికెను.
రాదు+కదా=రాదుగదా, రాదుకదా.
కూడుదురు + పోయుందురు=కూడుదురు వోయుందురు.
అని యీకార్యము క్రియలకు వెనుకను వచ్చును.

78. తెనుఁగు పదములకంటెఁ బరమయిన సంస్కృతపదంబులయందుండు క చ ట త పలు గ స డ ద వలు గావు.

ఉ. మగఁడు + కరుణించె = మగఁడుకరుణించె.

తమ్ముఁడు + చతురుఁడు = తమ్ముఁడుచతురుఁడు.

కోడుకు + టంకాయుధుఁడు = కోడుకుటంకాయుధుఁడు.

తండ్రిమాట + తథ్యము = తండ్రిమాటతథ్యము.

ఈపని + పుణ్యము = ఈపనిపుణ్యము.

79. ద్వంద్వసమాసమునందు పూర్వపదాంతస్వరమునకు పరమయిన పరుషములకు గ స డ ద వలు ఆదేశంబు లగును.

ఉ. కూర + కాయ = కూరగాయలు.

కాలు + చేయి = కాలుసేతులు.

టక్కు + టెక్కు = టక్కుడెక్కులు.

అన్న + తమ్ముఁడు = అన్నదమ్ములు.

రాక + పోక = రాకపోకలు.

కండతుండేపులు అందచందములు, అప్పాచెల్లెండ్రు ఇత్యాది ప్రయోగములును గలవు. "తత్యపునిళార్య లితవు రప్పాచెల్లెండ్రనిమిషులు నమర గణముఁ గనిరి." నిర్వచనోత్తరరామాయణము. "అక్కాచెల్లెండ్రయుర్వ." భా.

80. కర్మధారయ సమాసంబునందు చిఱు మొదలయిన వానికి అచ్చాదిపదములు పరమగుచో పదాంతస్వరమునకు లోపమును లుప్తస్వరమునకు పూర్వమయిన హల్లునకు ట ద్విత్వము నగు.

ఉ. చిఱు + ఉసురు = చిట్టుసురు. అ. చిట్టుయిర్.

చిఱు + ఎలుక = చిట్టెలుక. ,, చిట్టెలి.

కడు + అణి = కట్టాణి. ,, కట్టాణి.

నిడు + ఊరుపు = నిట్టూరుపు ,, నిట్టుయిర్పు.

నడు + ఏలు = నట్టేలు. ,, నట్టాలు.

వీనిలో కుఱ్ఱుఱుర్ శిఱ్ఱెలి అను ఆఱునపుంసకములందు శకటరేఫ ద్విత్వమునకు టకారద్విత్వము ఆదేశము.

81. వేము ప్రభృతులకును కసవము ప్రభృతులకును సంబంధార్థకమయిన అప్రత్యయము వచ్చును. వేము ప్రభృతుల మకారమునకు బిందుపూర్వక పకారమును కసవము ప్రభృతుల మకారమునకు పకారమును ఆదేశంబులగును.

ఉ. వేము + అ + చెట్టు = వేంపచెట్టు.

పాము + అ + పేడు = పాంపపేడు.

సాము + అ + చేను = సాంపచేను.

అమ్ము + అ + ములికి = అంపములికి.

ఎమ్ము + అ + గూడు = ఎంపగూడు.

కసవము + అ + గడ్డి = కసవపగడ్డి.

ఇసుము + అ + దారి = ఇసుపదారి.

మినుము + అ + పప్పు = మినుపపప్పు.

ఎనుము + అ + దూడ = ఎనుపదూడ.

జనుము + అ + నార = జనుపనార.

వేము, సాము, పాము, ప్రేము, అమ్ము, ఎమ్ము, చేము ప్రభృతులు. కసవము, ఇసుము, ఉదుము, ఎనుము, జనుము, మినుము - కసవము ప్రభృతులు.

ఈశబ్దములలో కొన్ని అఱవమునందు బకారాంతముగా నుండును. సంధియందువచ్చు పకారము ఆ బకారస్థానమునుండె వచ్చుచున్నది.

ఉ. వేప్పు + అ + కెడి = వేప్పంకెడి.

82. అందు అను సప్తమీవిభక్తి ప్రత్యయము అంతమునందు కలిగిన పదమునకు పరంబుగ సమాసమునందు షష్ఠ్యర్థకములయిన, అన్ ఇ ప్రత్యయములు వచ్చును.

ఉ. నాయందు + కరుణ = నాయందు+అన్+ఇ+కరుణ = నాయందని కరుణ = నాయందలికరుణ. అన్ ప్రత్యయముయొక్క నకారమునకిది లక్ష్యము.

83. ద్రుతప్రకృతికముయొక్క అంత నకారమునకు పరముగవచ్చు పరుషములకు సరళంబులు ఆదేశంబులగు. ఆదేశములయిన సరళములకు ముందు నకారమునకు సంశ్లేషమును, అనుస్వారాదేశమును, స్వత్వంబును పాక్షికముగ నగును.

సంశ్లేషమనఁగా నకారము పరమయినహల్లుతోఁ గూడుకొనుట. స్వత్వము నకారము ఉకారేకారములతోఁ గూడియుండుట.

ఉ. పూచెన్ + కలువలు = పూచెన్గలువలు, పూచెంగలువలు, పూచెఁగలువలు, పూచెనుగలువలు.

కడపటి యుదాహరణమున స్వత్వమువచ్చినది. అనఁగా నకారము ఎల్లప్పుడుండునట్లు అచ్చుతోఁ జేరియున్నది.

84 సరళస్థిరంబులు పరంబులగునపుడు లోపంబును సంశ్లేషంబును స్వత్వంబును నగును.

ఉ. వచ్చెన్ + గోవులు = వచ్చెగోవులు, వచ్చెన్గోవులు, వచ్చెనుగోవులు. ఉఱిమెన్ + ఘనము = ఉఱిమెఘ

నము, ఉతికిమెన్ఖనము, ఉరిమెనుపనము. వచ్చెంధాత్రి పతి, పాడెంగంధర్వుఁడు - అని కొన్నిచోట్ల నకారము పూర్ణానుస్వారము అగును.

85. సమాసంబునందు ద్రుతంబునకు పరంబయిన ఉకారము లోపించును.

ఉ. చిగురుంగైదువు, చిగురుఁగైదువు, చిగురున్గైదువు.

చిగురునుగైదువు అనిరాదు.

చిగురుశబ్దమునకు పరముగ షష్ఠ్యర్థక మయిన ఇన్ ప్రత్యయము వచ్చినది. ఇకారలోపము రాఁగా నకారము మిగిలినది. దానికి ద్రుతకార్యము.

తలన్ + ప్రాలు = తలంబ్రాలు, తలఁబ్రాలు, తలన్బ్రాలు. తలనుబ్రాలు అనిరాదు.

ఊరన్ + పిచ్చిక = ఊరఁబిచ్చిక, ఊరంబిచ్చిక ఊరన్బిచ్చిక. ఊరనుబిచ్చిక అనిరాదు.

తలన్ ఊరన్ శబ్దములలో అంతమునందుండు అన్ సప్తమీ విభక్తి ప్రత్యయము.

అట్లె కర్మణిప్రయోగంబునందు నకారాంతమైన భావనామంబు పూర్వపదంబయి ఉత్తరమయిన పడుధాతుజన్యక్రియలతో సమస్తమయి వచ్చుటచేత నకారమునకు స్వత్వసంధి లేదు.

ఉ, చేయన్ + పడెను = చేయన్బడెను, చేయంబడెను, చేయఁబడెను.

86. ఉదంతమునకు పరంబుగవచ్చు ఇనాగమము పోలికచేత ఋకారాంతమునకు పరంబుగను వచ్చును.

ఉ. ధాతృ+అనుమతి=ధాతృవనుమతి.

సంస్కృత పదంబులందు ఋ కారమును రు కారమునవలెనే యుచ్చరించుట ఆంధ్రదేశస్థుల సంప్రదాయము. ఋ కారాంత పదములెల్లను రు కారాంతములవలె నుచ్చరింపఁబడుచున్నవి. కాఁబట్టి ఋ కారాంతములకు వెనుకను ఇనాగమము వచ్చుచున్నది.

మతాంతరమున; ధాతృ శబ్దమునకు డు ప్రత్యయము చేరఁగా ఉత్వమునకు లోపము. ప్రత్యయాంతమందుండు డు కారమునకు మారుగ అనుస్వారస్థానములో పూర్వముండిన నకారము రాఁగా, ధాతృన్ అనివచ్చును. రాముండు+ఆజ్ఞ = రామున్ + ఆజ్ఞ, 'రామునియాజ్ఞ'. ఇచ్చట రాముండు అను దానిస్థానములో రామున్ వచ్చినట్లు, ధాతృఁడు అను దాని స్థానములో ధాతృన్ అనివచ్చును.

87. క్రిందవచ్చు సంధులయందు వచ్చెడు నకారము పూర్వపదాంతమందు అపూర్ణార్థకమయిన ఉన్ అవ్యయముచేతను సిద్ధించునది:

ఉ. నాకొఱకు + ఇచ్చెను = నాకొఱకిచ్చెను.
నాకొఱకున్ + ఇచ్చెను = నాకొఱకునిచ్చెను.
నాకు + ఇచ్చెను = నాకిచ్చెను.
నాకున్ + ఇచ్చెను = నాకునిచ్చెను.
నాయందు + ఆదరము = నాయందాదరము.
నాయందున్ + ఆదరము = నాయందునాదరము.
ఇందు + ఉన్నాఁడు = ఇందున్నాఁడు.
ఇందున్ + ఉన్నాఁడు = ఇందునున్నాఁడు.

ఎందు + అరిగెను = ఎందవరిగెను.
ఎందుఁగ్ + అరిగెను = ఎందునవరిగెను.
చేసెడిగ్ + అతఁడు = చేసెడినతఁడు.
చేసెడుగ్ + అతఁడు = చేసెడునతఁడు.
చేయుఁగ్ + అతఁడు = చేయునతఁడు.

చేయుఁగ్ — ఇది భవిష్యత్కాల క్రియాజన్య విశేషణము. అఱవము శెయ్యక్. ఈ అఱవశబ్దము శెయ్యఁదు అని మాఱును. అట్లే తెనుఁగునందు చేయుఁగ్ పదము చేసెడు అని వచ్చును. దీనికి సముచ్చయార్థకమయిన ఉగ్ చేర్చి ఉగ్ ప్రత్యయోకారమునకు ఇత్వమును పాక్షికముగాఁ జేయఁగా చేసెడిగ్, చేసెడుగ్ అనురూపములు సిద్ధించును.

వర్తమానార్థక క్రియా విశేషణమునకు పాక్షికముగ సముచ్చయార్థకమయిన ఉగ్ ప్రత్యయము చేర్పఁబడుటచేత అది పాక్షికముగా నకారాంత మగును.

ఉ. చేయుచు + ఉన్నాఁడు = చేయుచున్నాఁడు.
చేయుచుగ్ + ఉన్నాఁడు = చేయుచునున్నాఁడు.

88. క్రిందవచ్చు సంధులయందు పూర్వపదమునకు షష్ఠ్యర్థకమయిన ఇగ్ ఉ ప్రత్యయములు చేర్పఁబడుచున్నవి.

సొగసు + తనము = సొగసున్దనము.
చిగురు + కైదువు = చిగురున్గయిదువు.
తళుకు + గజ్జెలు = తళుకున్గజ్జెలు.
సింగంబు + కొదమ = సింగపున్గొదమ.
ఉన్నతంబు + గొడుగు = ఉన్నతంపున్గొడుగు.

ను. ఇనాగమముయొక్క నకారమునకు టత్వమును ఇకారము నకు లోపమును వచ్చును.

ఉ. కలికి+అమ్మ=కలికిటమ్మ. పేరు+ఉరము=పేరుటురము.
నిగ్గు+అద్దము=నిగ్గుటద్దము. చిగురు+ఆకు=చిగురుటాకు.
పరసంబు+అలుక=పరసపుటలుక. పొదరు+ఇల్లు=పొదరుటిల్లు.
ఇనాగమముయొక్క ఇకారమునకు లోపమురాఁగా నకారమునకు టత్వము.

90. గుణవచనములయిన నల్లనాదులకు పరంబుగ పరుషము వచ్చునప్పుడు అకారము లోపించును. నకారమునకు బింద్వాదేశంబును సంశ్లేషంబును వైకల్పికముగనగు.

ఉ. నల్లన + కాకి = నల్లంగాకి, నల్లన్గాకి.
నల్లని + తనము = నల్లందనము, నల్లన్దనము.

91. తాను నేను పదముల నకారము ప్రత్యయాంత నకారము కాకపోయినను దానికి ద్రుతకార్యము కలుగును. సంశ్లేషము లేదు.

ఉ. తాను+చదివె=తానుజదివె, తాఁజదివె.
తాను+వినె=తానువినె, తావినె.
నేను+కంటిని=నేనుగంటిని, నేఁగంటిని,
నేను+వచ్చితి=నేనువచ్చితి, నేవచ్చితి.

నకారమునకు పూర్వము దీర్ఘముండుటచేత దానిచోటవచ్చిన అనుస్వారమునకు నిత్యముగ అర్ధబింద్వాదేశము వచ్చును. తాంజదివె అని రాదు.

92. కొన్ని సమస్తపదంబులందు అఱవమునందు వచ్చెడు సంధివిధులె అఱవ పదములనుండి వచ్చిన తెనుఁగు పదముల సంధులకు మూలము.

అ.

| | |
|---|---|
| ప్రాయిల్లు | పఴఇల్. |
| లేఁగొమ్ము | ఇళంగొమ్బు. |
| ప్రాఁగెంపు | పఴంగెంపు. |
| కెందామర | శెందామరై. |
| పూఁదోఁట | పూందోట్టమ్. |
| క్రొక్కారు | పుదుక్కార్. |
| క్రేఁగాలు | కీఴ్ క్కాల్. |
| క్రేఁదొడ | కీఴ్ త్తొడై. |

పఴం ప్రాన్, పఴ ప్రా, ఇళమ్ లేన్, కీఴ్ క్రే అనియుం వచ్చియున్నవి.

పుదు అనునది కుదు, క్దు, క్దొ, క్రొ అని పరిణమించినది. వర్ణప్లుతి విధిచేతను ఉకారము దకారమునకు వెనుకఁబోయి ఒత్వమును బొందెను. పకార దకారములకు క్రమముగ కకార రేఫములు ఆదేశములు.

93. నిండు, నెఱ, నిఱు, సగము, వంక, పదములకు కొన్ని పదంబులు పరంబులగునపుడు ఆద్య వర్ణములు దప్ప మిగిలిన వర్ణములకు లోపంబగు.

ఉ. నిండు + వెలి = నివ్వెలి.

నిండు + వెఱుఁగు = నివ్వెఱుఁగు.

కేలు + తఱులు = కెత్తఱులు (పెద్దతఱలు.)

నీఱు + పస్తు = నిప్పస్తు (శుష్కోపవాసము.)

సగము + గోరు = సంగోరు.

వంక + చెఱుఁగు = వంజెఱుఁగు.

సగము + పాలు = సాఁబాలు.

94 అచ్చునకా మ్రేడితము పరమగునపుడు లోపము బహుళము.

ఔర + ఔర = ఔరౌర.

ఏమి + ఏమో = ఏమేమో, ఏమి యేమో.

95. ఆమ్రేడితము పరంబగునపుడు విభక్తిలోపము వైకల్పికముగ నగు.

ఉ. అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్,
అప్పటికప్పటికిన్.

ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్,
ఇంటనింటన్.

ఊరన్ + ఊరన్ = ఊరూరన్,
ఊరనూరన్.

ఇంచుక, నాఁడు మొదలగువానికి అంత్యవర్ణలోపము వైకల్పికము;

ఉ. ఇంచుక + ఇంచుక = ఇంచించుక.

నాఁడు + నాఁడు = నానాఁడు.

నాఁడు నాఁడు అని లోపంబులేనిసంధియును ఇంచు కించుక అనుసంధియుఁగలవు. దీనియందు ఇంచుకపదముయొక్క అంతాకారమునకుమాత్రము లోపము.

96 శబ్దపల్లవములో పడు క్రియకుముందు కేవల ధాత్వర్థవ్యాపార కర్తృపదముయొక్క 'ము' వర్ణమునకు లోప పూర్ణబిందువులు వికల్పమగు.

ఉ. సంతోషము + పడెన్ = సంతోషపడెన్
సంతోషంపడెన్
సంతోషముపడెన్.

కేవలధాతువు పడు అనునది. ధాత్వర్థ వ్యాపార కర్తయనఁగా — పడుధాతువుచేఁ జెప్పఁబడిన కార్యము కలుగుట (ఉద్భవించుట). కలుగునది సంతోషము. సంతోషము కలుగుటకు ఆధారమైన దేవదత్తాదులు, సంతోషపడెను అను శబ్దపల్లవక్రియకు కర్త.

అశ్వముపడెన్. పడుక్రియకును, ధాత్వర్థమయిన పడుటకును, అశ్వము కర్తయగుటచే అశ్వపదము కేవలధాత్వర్థ వ్యాపారకర్త కాదు.

97. పదాంతస్సంధి యందు అనేకవిధములయిన ఆగమాదేశములు కనఁబడుచున్నవి. వానిని క్రియాప్రకరణములందును మెండుగాఁ జూడవచ్చును. వానిలోఁ గొన్నింటినిమాత్రము ఇక్కడఁ జెప్పెదను.

98. ఎఁడు, ఇంచు ప్రత్యయములు పరమగుచో పూర్వ పదాంత స్వరములకు లోపము.

వీసె + ఎఁడు = వీసెఁడు.

పతించు+ ఇంచు = పతింపించు.

99. అనునాసికములకు స్పర్శము పరమగుచో బింద్వాదేశములగును.

కొన + అగు = కొనగు = కొంగు.

వణ + అగు = వణగు = వంగు.

కనుట = కంట.

కెంపు = అ. కెమ్ము.

తంపు = అ. తణ్ + పు = తమ్పు.

100. అజాది విభక్తిప్రత్యయములు పరమగుచో ప్రాతిపదికాంతములయిన న ర ఱ ల యలకు టకార తకారములు ఆదేశంబులగును. యకారమునకు తకారము.

| | | | |
|---|---|---|---|
| మన్ను | మంటి | మంటన్ | మంటిన్. |
| కన్ను | కంటి | కంటన్ | కంటిన్. |
| నోరు | నోటి | నోటన్ | నోటిన్. |
| ఏఱు | ఏటి | ఏటన్ | ఏటిన్. |
| చేయి | చేతి | చేతన్ | చేతిన్. |
| వాయి | వాతి | వాతన్ | వాతిన్. |
| పల్లు | పంటి | పంటన్ | పంటి, లకారమునకు నకారాదేశము ఆదేశనకారమునకు టత్వము. |

101. కొన్ని పదంబులలో నకారమునకు పరమయిన తకారమునకు టత్వమును, దకారమునకు డత్వమును పాక్షికముగ నగు.

అనితిని = అంటిని. వినితిని = వింటిని.

అనుతన్ = అంటన్. వినుతన్ = వింటన్.

అనుదురు అందురు అండురు.

102. ధాత్వంత యకారములకు కాలవాచ్యచ్చు పరమగుచో సకారమాదేశమగును.

చేయు + ఎన్ = చేసెన్. చేయు + ఇ = చేసి.

103. ఇట్లు ఇతరమైన సంధివిధులు ఊహ్యంబులు.



## నామప్రకరణము.

104 నామములు ఏడువిధములు; ౧. సామాన్యనామములు.
౨. సంజ్ఞానామములు.
౩. సముదాయనామములు.
౪. ధాతుజన్యపురుషనామములు.
౫. భావనామములు.
౬. సంఖ్యానామములు.
౭. సర్వనామములు.

౧. సామాన్యనామము, ఒకజాతికిఁజేరిన వ్యక్తులను సామాన్యముగా బోధించునది; ఉ. పశువు, పక్షి, గోవు, మనుష్యుఁడు, మొదలయినవి.

౨. సంజ్ఞానామము, ఒకవ్యక్తిని అనఁగా వస్తువును మాత్రము బోధించునది. రాముఁడు, కృష్ణుఁడు, బుక్కరాయఁడు, అశోకుఁడు, కాళిదాసుఁడు.

౩. సముదాయనామము, సమూహమును బోధించునది; ఉ. బ్రాహ్మణ్యము 'బ్రాహ్మణసమూహము.' లోకము 'జనులసమూహము.' మొ.

౪. ధాతుజన్యపురుషనామము, ధాతువులవలనఁ బుట్టి కాలత్రయమును జూపుచు వాఁడు వారు మొదలయిన విభక్తిప్రత్యయములను బొందునది; ఉ. చేయువాఁడు,

చేయుచున్నవాఁడు, చేసినవాఁడు. మొ.

౫. భావనామము, — భావమనఁగా శుద్ధమయిన ధాత్వర్థము. దానిని బోధించునది; ఉ. వచ్చుట, తెచ్చుట, పోవుట, ఆడుట; రాక, పోక, ఆట; రామి, తేమి, పోమి, ఆడమి. మొ.

౬. సంఖ్యానామము, — సంఖ్యను సంఖ్యేయమును బోధించునట్టిది. సంఖ్యేయమనఁగా సంఖ్య చేయఁదగినది; ఉ. (సంఖ్య.) ఒకటి, రెండు, మూఁడు, నాల్గు, (సంఖ్యేయము) ఒకఁడు, ఇరువురు, ముగ్గురు, నలుగురు. మొ.

౭. సర్వనామము. — వాక్యమునందు నామములకు బదులుగా వచ్చునది; ఉ. వాఁడు, వీఁడు, ఎవఁడు, నేను, నీవు. మొ.

105. నామములు పురుషభేదమును బట్టి మూఁడు విధములు.

౧. ప్రథమ పురుషము.
౨. మధ్యమ పురుషము.
౩. ఉత్తమ పురుషము.

సర్వనామేతరములయిన యన్ని నామములును, వాఁడు వీఁడు మొదలయిన సర్వనామములును ప్రథమపురుషమనఁబడును.

౨. నీవు, మీరు, ఈవు, ఈరు మధ్యమపురుష మనఁబడును.

౩. నేను, ఏను, నేము, మేము, ఏము ఉత్తమపురుష మనఁబడును.

106. నామములకు లింగవచన విభక్తులు గలవు.

| | |
|---|---|
| పుంలింగము, | పురుషవాచకము. |
| స్త్రీలింగము, | స్త్రీవాచకము. |
| నపుంసకలింగము, | మనుష్యులు, దేవతలు వీరికంటె నితరమయిన జంతువులను నిర్జీవ వస్తువులను దెలుపునది. |

ఈలింగములు మూఁడువిధములఁ దెలుపఁబడును.

౧. ప్రత్యయముచేత,

| పుం. | స్త్రీ. |
|---|---|
| చిన్నవాఁడు. | చిన్నది. |
| పెద్దవాఁడు. | పెద్దది. |
| ఆటకాఁడు. | ఆటకత్తె. |
| సొగసుకాఁడు. | సొగసుకత్తె. |
| ఒకఁడు. | ఒకతె. |
| కోయఁడు. | కోయత. |
| కోయవాఁడు. | కోయది. |
| ప్రేఁడు. | ప్రేత. |
| బల్లిదుఁడు. | బల్లిదురాలు. |
| జెట్టిదుఁడు. | జెట్టిదురాలు. |
| రాజు. | రాణి. |
| దేవర. | దేవేరి. |

| పుం. | స్త్రీ. |
| --- | --- |
| పుత్రుడు. | పుత్రి. |
| గుణవంతుడు. | గుణవతి, గుణవంతురాలు. |
| జ్ఞానవంతుడు. | జ్ఞానవతి, జ్ఞానవంతురాలు. |
| వగలాడు. | వగలాడి. |
| చెంచు. | చెంచెత. |
| చాకి. | చాకిత. |
| మాతులుడు. | మాతులాని. |
| ఆచార్యుడు. | ఆచార్యాని. |

౨. ముందొకపదము చేర్చుటచేత,

| | |
| --- | --- |
| మగబిడ్డ. | ఆడుబిడ్డ. |
| కోడెదూడ. | పెయ్యదూడ. |
| గిబ్బదూడ. | పడ్డదూడ. |
| పుంజుకోడి. | పెట్టకోడి. |

౩. వేఱువేఱుమాటలు ఉపయోగించుటచేత,

| | |
| --- | --- |
| తండ్రి. | తల్లి. |
| తాత. | అవ్వ. |
| మగడు. | పెండ్లము. |
| అన్న. | అక్క. |
| అల్లుడు. | కోడలు. |
| పిత. | మాత. |
| వరుడు. | వధువు. |
| తమ్ముడు. | చెల్లెలు. |
| కొడుకు. | కూతురు. |

| పుం. | స్త్రీ. |
| --- | --- |
| పుంజు. | పెట్ట. |
| ఎద్దు. | ఆవు. |
| పోతు. | పెంటి. |
| గోడా. | గోడిగ. |

వచనములు రెండు:—౧ ఏకవచనము.

౨ బహువచనము.

ఏకవచనము=ఒకవస్తువును బోధించునది; ఉ. రాముఁడు, కృష్ణుఁడు, వనము, ధనము, లత, నది, తరువు, మొ.

బహువచనము=ఒకటికి అధికముండిన సంఖ్య గలిగిన వస్తువులను బోధించునది; ఉ. రాములు, కృష్ణులు, వనములు, ధనములు, లతలు, నదులు, తరువులు, మొ.

107. నామములకును ఇతర నామములకును, నామములకును ఆఖ్యాతములకును, అర్థమందుఁగలుగు సంబంధములను దెలుపునట్టి రూపభేదములు విభక్తులనఁబడును. ఈ విభక్తులు ప్రత్యయములచేఁ దెలుపఁబడును.

విభక్తిప్రత్యయములు:—

అండు, అఁడు, ఉండు, ఉఁడు, అది, డి, అము, అమ్ము, అంబు మొదలయినవి— ప్రథమైకవచనంబునందగు.

అలు, ఉలు, లు, అరు, ఉరు, రు, అవి, వి మొదలయినవి— ప్రథమా బహువచనంబునం దగును.

అన్, ఇన్, ఉన్, గురించి, కూర్చి—ద్వితీయ.
అన్, చేతన్, చేన్, తోడన్, తోన్, చేసి—తృతీయ.
కి, కు, కఱకు, కొఱకు—చతుర్థి.
కంటెన్, వలనన్, పట్టి, ఉండి, తొట్టి, కొలెన్, చేసి—పంచమి.
కి, కు, అ, ఇ, ఉ, అన్, ఇన్—షష్ఠి.
అన్, ఇన్, ఉన్, అందు, లోన్, లోపలన్—సప్తమి.

108. వీనిలోఁ గొన్ని శుద్ధప్రత్యయములు. ఇతరములు పదములు. ప్రత్యయములకు పూర్వమయినస్వరమే యంతము నందు ఉచ్చారణార్థముగా వచ్చును. అకారాది ప్రత్యయమునకు ఎకారాది ప్రత్యయమునకును అంతమునందు ఉకారము వచ్చును. వీనికి నుదాహరణములం గ్రిందఁ జూడుము.

శుద్ధవిభక్తిప్రత్యయములకు ఉదాహరణములు.

ద్వి. { అన్ — లతనుజూచెను.
ఇన్ — హరినిజూచెను.
ఉన్ — శంభువును వేఁడెను. }

తృ. అన్. — పంటనుగోలికెను.

చ. { కి — హరికివందనము.
కు — శంభునకుమంగళము. }

ష. { ఇ — రాజునియాజ్ఞ, గురునియుపదేశము.
అ — మన పుస్తకము, పొలపుచేను, ఇనుపదారి.
ఉ — దేశంపుజనులు. }

కి - కు - ప్రత్యయములు ప్రయోగమునందున విభక్తి ప్రతిరూపకశబ్ద తుల్యంబులు కాఁబట్టి విభక్తి ప్రాతిపదికము లతోఁ జేర్పఁబడెను.

> ఈ కి కు ప్రత్యయముల మూలరూపము పూర్ణశబ్దముగా నుండవలెయు. అది చింత్యము.

ఉ. రామునికి, కృష్ణునికి శంభునకు — రామునికయి, కృష్ణునికయి, శంభునకయి, ఆ. రామునకొఱకు. క. రామునిగాని.

యొక్క — అ. ఉడయ ఇదిమాత్రము నామవిశేషణము,

ఉ. రామునియొక్క. అ. రామనుడైయ.

విభక్తి ప్రత్యయములు.

110. ఉండు, ఉండు ప్రత్యయములు తత్సమదేశ్య పదంబులకు వచ్చును.

ఉ. (తత్స.) కృష్ణుండు, కృష్ణుఁడు, గోవిందుండు, గోవిందుఁడు, దామోదరుండు, దామోదరుఁడు, శివుండు, శివుఁడు, (తద్భ. దే.) అక్కలుండు, అక్కలుఁడు, కందుండు, కందుఁడు, కొమరుండు, కొమరుఁడు, చందురుండు, చందురుఁడు, జముండు, జముఁడు, వెక్కలుండు, వెక్కలుఁడు; కావలుండు, కావలుఁడు, బెట్టిదుండు, బెట్టిదుఁడు, బెడిదుండు, బెడిదుఁడు.

బెట్టిదుండు = బెట్టి+ఉండు. (బెట్టు = ఉద్ధతి.) బెట్టియుండు - బెట్టిదుండు. యాకు దాదేశము.

బెడిదుండు = బెడి+ఉండు. (బెడి = బెడిదము = క్రౌర్యము) దీనియందును యాకు దాదేశము.

వీనిలోఁ గొన్నింటికి స్త్రీలింగమునందు ఆలు ప్రత్యయమును నపుంసకలింగమునందు అము ప్రత్యయమును జేర్పఁబడును.

బల్లిదము, బల్లిదురాలు, కొమరురాలు.

111. అండు, అఁడు ప్రత్యయములు తద్భవదేశ్యములందు మాత్రము వచ్చును.

| | |
|---|---|
| ఉ. గండఁడు. | క. గండను. |
| మిండఁడు. | ,, మిండను. |
| మగఁడు. | అ. మగన్. |
| మనుమఁడు. | ,, మణుమగన్. |
| రాయఁడు. | సం. రాజ. |
| పాఱఁడు. | |
| బాఁపఁడు. | అ. పార్పాన్. సం. బ్రాహ్మణ. |
| ముదుకఁడు. | ,, ముదుకన్. |
| ప్రేఁడు. | సం. పల్లవ. అ. పల్లవన్. |
| కయ్యరేఁడు = | 'ఒక జాతిగుఱ్ఱము' |
| కత్తళేఁడు = | 'తెల్లని గొరిజ తోఁకఁ జెండ్రుకలు గలవల్లని గుఱ్ఱము' = కత్తలాని. సం. కర్తలాణః |
| జన్నెఁడు = | 'ఒక జాతి గుఱ్ఱము'. |
| నీలఁడు = | 'నీలవర్ణముగల గుఱ్ఱము'. |
| పుతియఁడు = | 'పులివతెకార్యముగల తుక్క— |

కయ్యరేఁడు మొదలయినవి పుంలింగ ప్రత్యయాంతములయినను నపుంసకలింగమందుఁ బ్రయుక్తము లగును.

**112** పగతుఁడు మాఱ్తుఁడు విల్తుఁడు ఈశబ్దములలో ప్రత్యయవకారమునకు తాదేశము.

ఉ. పగతుఁడు = పగవుఁడు. అ. పగైవన్, 'శత్రువు'; పగై, తె. పగ, 'ద్వేషము'

(గట్టు), విల్తుఁడు=విల్లవుఁడు. అ. విల్లవన్. విల్, తె. విల్లు.

మాఱ్తుఁడు. అ. మాఱువాన్, మాఱు 'వేఱు [illegible] యొండుట'.

**113.** కొన్ని పదంబులందు ఆండు, ఉండు ప్రత్యయముల యొక్క ఆద్యములయిన అచ్చులకు లోపము అగును.

కల్లరీఁడు = కల్లరి+వాఁడు = కల్లరియఁడు = కల్లరీఁడు. కల్లరి 'అసత్యము పలుకువాఁడు'. ఈశబ్దమునకు వాఁడు ప్రత్యయము చేరఁగా కల్లరివాఁడు అని నిలుచును. ఆకారమునకు హ్రస్వాదేశము రాఁగా కల్లరివఁడు అని యగును. వర్ణసమీకరణవిధిచే వకారమునకు యకారాదేశము వచ్చెను. ఇకార యకారములకు ఈకారాదేశము రాఁగా కల్లరీఁడు అని సిద్ధించెను,

సొక్కలీఁడు=సొక్కలి+వాఁడు; సొక్కలి=మత్తుఁడు.

అటమటీఁడు=అటమట+వాఁడు, 'అటమట కలిగినవాఁడు;' అటమట=వంచన. అటమటశబ్దముయొక్క తుది అకారము ఇకారము కాఁగా, వాఁడు ప్రత్యయముయొక్క ఆకారమునకు హ్రస్వమును, వకారమునకు యకారాదేశమును, ఇకార యకారములకును, ఈయాదేశమును పూర్వమువలె వచ్చినవి.

కమ్మతీఁడు = కమ్మతము + వాఁడు. మువర్ణలోపము. మిగిలినవి పూర్వము వలె.

కొండీఁడు = కొండెము + వాఁడు. మువర్ణలోపము. కొండెవాఁడు. ఎకారమునకు ఇత్వము. మిగిలినది పూర్వమువలె.

ఎకిమీఁడు = యజమానుఁడు = ఎకిమానుఁడు = ఎకిమాండు = ఎకిమీఁడు. యకారమునకు ఎత్వము. జకారమునకు కిత్వము. నులోపము. ఆకారమున కీత్వము.

అట్టీఁడు = అట్టి + వాఁడు. "శ్రీవసుధాధినాథుల జయించిన యట్టీఁడ" భార. ఆది.

ఇట్టీఁడు = ఇట్టి + వాఁడు. "ఎఱుఁగనే మే మేమిటను నిట్టీఁడగుట." భార. శా.

ఎట్టీఁడు = ఎట్టి + వాఁడు. "ఎట్టిఁడు వానిఁ జేకుఁడు." రా. సు.
ఏఁడు = అ. ఇవన్

ఇవనేఁడు. వన్ ప్రత్యయము వకారమునకు యత్వమాయినది.

ఇయఁడు = ఏయఁడు = ఏఁడు.

114. వృద్ధాదులకు ఉండు ప్రత్యయాంతరూపమును ఉకారాంతరూపమును గలవు.

వృద్ధుండు మూర్ఖుండు చార్వాకుండు నీచుండు గృహస్థుండు.
వృద్ధు మూర్ఖు చార్వాకు నీచు గృహస్థు.

వృద్ధు అని ఉకారాంతరూపమునకుఁ గారణము — వృద్ధర్ గళ్ అను అఱవబహువచనము సంక్షేపముచే వృద్ధులు అని రూపమును బొందెను. ఈ సంక్షేపరూపమందు ఉలు అనుభాగము బహువచనప్రత్యయముగా

గ్రహింపఁబడుటచే వృద్ధ అను రూపము ఏకవచనము
నందు సిద్ధించెను. అరవములో వృద్ధర్గళ్ అను బహు
వచనరూపము వృద్ధాళ్ అని గ్రామ్యభాషయందు వలె
తెలుఁగునందు వృద్ధులు అను రూపము వచ్చెను.

115. అసురశబ్దమునకు అసురుఁడు అసుర అని రెండు రూపములు గలవు

అ. అసురర్గళ్ అసురాళ్ అని మాఱును. అసురాళ్
తెలుఁగున అసురలు అయ్యెను. అసురలుశబ్దమును
అసుర + అలు అని విభజింపఁగా, అసురశబ్దము
ఏకవచనముగను సిద్ధించె.

116. అట్లె దూతాదిశబ్దములకు అకారాంత రూపము పాక్షికముగఁ గలుగును.

దూతుండు,దూత; యోధుండు.యోధ; కుంతుండు, కుంత.

117. మహద్వాచకములయిన ఉకారాంతశబ్దములకు ఉ ప్రత్యయము బహుళముగ నగు. దానికిని ప్రాతిపదికాంత్యో కారమునకును నడుమ వకారాగమంబగును.

ఉ. విష్ణువు =విష్ణు +వ్+ఉ. పక్షమున విష్ణుఁడు.
శంభువు=శంభు+వ్+ఉ. పక్షమున శంభుఁడు.
వసువు =వసు +వ్+ఉ. పక్షమున వసుఁడు.

అమహద్వాచకములకు ఉ ప్రత్యయము నిత్యముగా నగు.

ఉ. తరువు = తరు + వ్ + ఉ.
మధువు = మధు + వ్ + ఉ.
ధేనువు = ధేను + వ్ + ఉ.
గోవు = గో + వ్ + ఉ.

సవిత
సవితృశబ్దము. } ,, సవితా.

నేత
నేతృశబ్దము. } ,, నేతా.

120. దీర్ఘాంతశబ్దంబుల యంతస్వరంబునకు హ్రస్వంబగు.

ఉ. రమ — రమా.
వనిత — వనితా.
లక్ష్మి — లక్ష్మీ.
గౌరి — గౌరీ.

ఏకాక్షరంబునకు హ్రస్వంబు రాదు

ఉ. క్ష్మా, భూ, శ్రీ, స్త్రీ, భీ, ధీ.

అపవాదము; భ్రూ, గోశబ్దములకు ఉప్రత్యయంబగును.

ఉ. భ్రువు = భ్రూ+వ్+ఉ. గోవు=గో+వ్+ఉ.

121. భూ నౌశబ్దములకు ఇప్రత్యయమును ఊకారమునకు హ్రస్వమును ఔకారమునకు ఆనాదేశమును అగును.

ఉ. భువి = భూ+వ్+ఇ.
నావి, నావ్ + ఇ; నావయనియుం గలదు.

122. కంధరాది శబ్దములకు అము ప్రత్యయంబు పాక్షికంబుగ నగు.

ఉ. కంధరము, నాసికము, భిక్షము, దంష్ట్రము, గ్రీవము, ఉల్కము. అము ప్రత్యయంబు లేనిపక్షమున—కంధర, నాసిక, భిక్ష, దంష్ట్ర, గ్రీవ, ఉల్క అను రూపములు సిద్ధించును.

123. చరిత్రాదుల అనుప్రత్యయముయొక్క మకారమునకు వైకల్పికముగ లోపంబగు.

ఉ. చరిత్రము—చరిత్ర, అలకము—అలక. మొ. చరిత్రము, అలకము, అభిలాషము, అక్షతము, ఘోషము, తరంగము, భ్రమము, విజృంభణము, వధము, వేగము, స్ఫురణము, హింసము.

చరిత్రములు చరిత్రాలు అనివచ్చి చరిత్రలు అని కాఁగా, ఆలు ప్రత్యయము బహువచన ప్రత్యయముగా గ్రహించిన గొుడల చరిత్ర అని ఏకవచనమునకు వచ్చును.

పక్షాంతరము;

కన్నడమున జ్ఞానము అనుపదము మకారమునకు వకారాదేశము వచ్చుటచే జ్ఞానవు అని మారును. పాక్షికముగ వుకారము లోపించిన జ్ఞాన అనియు వచ్చును. అట్లే తెనుంగునను చరిత్రాదులకు ములోపము వచ్చును.

124. హలంతమునకు సామాన్యముగ మూఁడులింగములలోను ఉప్రత్యయము వచ్చును. ప్రత్యయ పూర్వమయిన హల్లునకు ద్విత్వంబు అగును.

ఉ. మరుత్తు, దిక్కు, కకుప్పు, రాట్టు, వాక్కు.

125. దీర్ఘమునకు పరమయిన హల్లునకు ద్విత్వంబు బహుళంబుగ నగు.

ఉ. వాక్కు, వాకు; రాట్టు స్వరాట్టు, స్వరాటు.

126. మత్వర్థప్రత్యయాంతములు (మత్ వత్ వస్ అంతములు) అయినవానికి బహుళముగ సంస్కృతవిభక్తులందు ప్రథమాద్వితీయవచనాదులయందు వచ్చురూపములలో నొకటి ప్రాతిపదిక మగు. ఉండు, ఉడు ప్రత్యయములును ఆ ప్రాతిపదికములకగు.

| | | |
|---|---|---|
| ఉ. శ్రీమత్ | శ్రీమంత్ | శ్రీమంతుఁడు. |
| గుణవత్ | గుణవంత్ | గుణవంతుఁడు. |
| హనుమత్ | హనుమంత్ | హనుమంతుఁడు. |
| విద్వస్ | విద్వాంస్ | విద్వాంసుఁడు. |
| భగవత్ | భగవంత్ | భగవంతుఁడు. |

హనుమత్ భగవత్ శబ్దములకు హనుమానుండు హనుమఁడు, హనుమ భగవానుండు అనియుం రూపములు గలవు.

పైఁజెప్పిన పదములకు స్త్రీలింగమునందు అంతమునగా వచ్చెడి ఈకారమునకు తెలుఁగునందు హ్రస్వమగును.

| | | |
|---|---|---|
| శ్రీమతి | శ్రీమతీ | శ్రీమత్. |
| గుణవతి | గుణవతీ | గుణవత్. |
| విదుషి | విదుషీ | విద్వత్. |

దీనికి శ్రీమంతురాలు, గుణవంతురాలు, విద్వాంసురాలు అనియు రూపములు వచ్చును.

127. మదాదులకు అము ప్రత్యయము వచ్చును.

| | | |
|---|---|---|
| ఉ. మదము | = మద్ | + అము. |
| ఉపానహము | = ఉపానహ్ | + అము. |
| స్రజము | = స్రజ్ | + అము. |
| సీవ్యతము | = సీవ్యత్ | + అము. |

130. నాంత నపుంసకశబ్దముయొక్క ప్రథమైకవచనము నకు తెనుంగున అముప్రత్యయము అగును.

| | | | |
|---|---|---|---|
| ఉ. కర్మము | కర్మ. | వర్మము | వర్మ. |
| శర్మము | శర్మ. | మర్మము | మర్మ. |
| చర్మము | చర్మ. | పర్వము | పర్వ. |
| బ్రహ్మము | బ్రహ్మ 'వేదము' 'తత్త్వము' | 'తపస్సు.' | |

131. ఆత్మన్ శబ్దమునకు ఆత్మము, ఆత్మ, ఆత్ముండు అని మూండురూపములు వచ్చును.

132. జగత్ ఇంద్రజిత్ శబ్దములకు తకారలోపము పాక్షికంబుగ నగు.

లుప్తతకారమయిన జగత్ శబ్దమునకు అముప్రత్యయము వచ్చును.

ఉ. జగము — జగత్తు.

ఇంద్రజి — ఇంద్రజిత్తు, ఇంద్రజిత్తుండు అని యిం రూపంబు వచ్చును.

133. పుంలింగమయిన రాజన్ శబ్దముయొక్క అంతము నకు ఉకారాదేశం బగు.

ఉ. రాజు, మహారాజు, ఖగరాజు.

నపుంసకలింగమగుచో నకారలోపమును అముప్రత్యయమును అగును.

రాజము, పర్వతరాజము, వృక్షరాజము.

134 సకారాంతములయొక్క అంత్య సకారమునకు లోపంబు బహుళంబుగానగు. సలోపము కాఁగా మనసు మొదలగువానికి అము ప్రత్యయమును ధనుస్సు మొదలగువానికి ఉ ప్రత్యయమును వచ్చును. అర్చి మొదలైనవానికి ఇకారాంతమును రావు సలోపము లేనిపక్షమున మనస్ మొదలగువానికి అంత్య సకారమునకు ద్విత్వము వికల్పంబుగ నగును.

| | | |
|---|---|---|
| ఉ. ఉరము | | ఉరస్సు. |
| వక్షము | | వక్షస్సు. |
| అర్చి రోచి | | అర్చిస్సు. |
| ధనువు | | ధనుస్సు. |
| ఆయువు | | ఆయుస్సు. |
| మనము | మనస్సు | మనసు. |
| శిరము | శిరస్సు | శిరసు. |
| సదము | సదస్సు | సదసు. |
| సరము | సరస్సు | సరసు. |

పయస్ వయస్ శబ్దములకు సలోపంబు కలుగదు. పయంబు అనియుఁ గలదని కొందఱు చెప్పుచున్నారు. ప్రయోగములు ఉండినయెడల గ్రాహ్యము.

135. కొండొక పుల్లింగసాంతశబ్దంబుల అంత్యసకారమునకు లోపము విభాషనగును. లోపమయినను గాకున్నను ఉండు ప్రత్యయము నిత్యముగ నగు

| | | |
|---|---|---|
| ఉ. అంగిరుండు | అంగిరసుండు | అంగిరస్. |
| ప్రచేతుండు | ప్రచేతసుండు | ప్రచేతస్. |

| | | |
|---|---|---|
| ఉగ్రశ్రవుండు | ఉగ్రశ్రవసుండు | ఉగ్రశ్రవస్. |
| ఊర్ధ్వకేతుండు | ఊర్ధ్వకేతసుండు | ఊర్ధ్వకేతస్. |
| విష్టరశ్రవుండు | విష్టరశ్రవసుండు | విష్టరశ్రవస్. |

136. వేధః పురోధశ్శబ్దంబులకు సలోపమును పురోధశ్శబ్దమునకు లోపము లేనిపక్షమున ఉంప్రత్యయమును అగును.

ఉ. వేధ వేధస్ 'బ్రహ్మ'

పురోధ పురోధసుండు 'పురోహితుఁడు'.

137. ద్యుహృచ్ఛబ్దములకు దివి హృదియగు.

ఉ. దివి ద్యుస్ 'స్వర్గము,' 'ఆకాశము'

హృది హృత్ 'మనస్సు'

138. కలన్యాదులకు ఏకవచనమునందు కుప్రత్యయంబు స్వార్థంబునందు వికల్పముగనగు. *

ఉ. కలను, కలంకు, కలఁకు;

కలను, కోలను, కొఱను, కొలను, గవను, కోఱను, మ్రాను, పరను, వలను, ఇవి కలన్యాదులు.

(వీని బహువచనములను చూడుము.)

139. రేన్యాదులకు గు ప్రత్యయంబు వైకల్పికంబు.

ఉ. రేను, రేఁగు; గోను, గోఁగు.

140. ఏకవచనమునందు అడుగ్వాదులకు గుప్రత్యయమును నిష్పాకాదులకు కప్రత్యయమును వెలఁగాదులకు గప్రత్యయమును నిత్యముగను అగును.

---

* క్రియాప్రకరణములో ౧౨౨వ పుట చూడుము.

అంతమందు కాడు ప్రత్యయము లుప్తము కాఁగా దేవర
జానరి శబ్దములు సిద్ధించుచున్నవి. ఇట్లే ఏకవచనమున
దాసన్ శబ్దముకలవ సాతనిశబ్దము వచ్చెను.

(క్రియా. ౧౧ - వ పుట - చూ.)

దేవేరి—ఇది దేవరశబ్దమునకు స్త్రీలింగమున వచ్చు రూపము.

142. అకారాంతంబులకు అలుప్రత్యయము.

ఉ. లతలు, రమలు, కద్రువలు, సీతలు.

ఆరవములో సురర్‌గళ్ అనునది సురాళ్ అని మారి సురలు అని తెనుఁగునవచ్చినట్లు, లతైగళ్ - లతాళ్ - లతలు అని వచ్చెను.

143. ఇతరశబ్దములకు ఉలు ప్రత్యయంబు.

ఉ. రాములు, వృద్ధులు, బల్లిదులు, హాతులు, మనువులు, వధువులు, రాజులు, రాణులు.

రామర్‌గళ్, రామాళ్ - రామలు అని వికారమును పొంది వర్ణసమీకరణవిధిచే లకారమునకు పూర్వమయిన అకారమునకు ఉత్వము కాఁగా రాములు.

144. ఆకారపూర్వక లకారాంతశబ్దములకు ఉలుప్రత్యయము చేర్చఁగా పదాంత లకారమునకు రేఫాదేశము.

ఉ. కాలురు = కాలు + ఉలు లకారమునకు రేఫాదేశము వర్ణవిభేదనవిధిచేతవచ్చుచున్నది 52-వ విధి చూడుము.

145. వగతుండు, అల్లుండు, వెయ్యుండు, బలియుండు ఈ శబ్దములకు బహువచనమందు ఉలుప్రత్యయము చేర్పఁబడును.

ఉ. వగతురు, బలియురు, అల్లురు, వెయ్యురు.

వగ శబ్దమునకు తప్రత్యయము చేరఁగా వగవరు అని వచ్చును. అ. క. [illegible]. రేఫమునకు పూర్వముయిన అకారమునకు వ్యత్యయకరణ విధిచే ఉత్వము. వకారమునకు తత్వము.

146. అండు ప్రత్యయాంత శబ్దములకు బహువచనమందు రు ప్రత్యయమగును.

ఉ గండండు—గండండ్రు, మిండండు—మిండండ్రు.

ఆ. గండల్—గండరు. అట్లయిన గండఁగాఁ డనుంగొన—గండండు—గండరు అని అరు ప్రత్యయముతో రావలెను. అట్లయినందువలె లెక్కింపనందున అరు అను బహువచన ప్రత్యయమును గండశబ్దమునకుఁ జేర్పవలయునే కాని గండండు అను ఏకవచనరూపమునకు జేర్చుట అశాస్త్రీయము. అట్లు చేయుంటవాడుకను బట్టియే. కన్నడమునందు గండందిరు అను బహువచనము చూడుము.

147. కాఁడు, గాఁడు ప్రత్యయాంత శబ్దములకు బహువచనమందు వికల్పముగ రుప్రత్యయమగు. రు ప్రత్యయము రానియెడ ఉలు ప్రత్యయమును, ఉలు ప్రత్యయముయొక్క ఆద్యోకారమునకు లోపమును, రలలకు ఆత్వమునగు.

| | |
|---|---|
| ఉ. విలుకాఁడు | విలుకాండ్రు. |
| వేఁటకకాఁడు | వేఁటకకాండ్రు. |
| వేఁటకాఁడు | వేఁటకాండ్రు. |
| చెలికాఁడు | చెలికాండ్రు. |
| అందగాఁడు | అందగాండ్రు. |
| జేరగాఁడు | జేరగాండ్రు. |
| విలుకారులు | విలుకాఱు. |
| వేఁటకారులు | వేఁటకాఱు. |
| వేఁడుకకారులు | వేఁడుకకాఱు. |

148. తేఁడు ప్రభృతులకు బహువచనమున డ్లు ప్రత్యయము. ప్రత్యయాద్యకారమునకు పాక్షికముగ లోపము.

ఉ. తేఁడులు, తేండ్లు. కమ్మతీఁడులు-కమ్మతీండ్లు, ఎకిమీఁడులు, ఎకిమీండ్లు. కల్లరీఁడులు కల్లరీండ్లు. ఆటమటీఁడులు, ఆటమటీండ్లు.

149. అట్టిఁడాద్యులకు బహువచనమందు ఁడు లోపమును రు ప్రత్యయమును అగును.

ఉ. అట్టిఁడు—అట్టిరు, ఇట్టిఁడు—ఇట్టిరు, ఎట్టిఁడు—ఎట్టిరు. అట్టివాఁడు అట్టిఁడు అని వచ్చినట్లు అట్టివారు అట్టిరు అని వచ్చినది.

150. కలవాద్యుల బహువచనమందు కులు ప్రత్యయమును రేనాద్యులకు గులు ప్రత్యయమును గానాద్యులకు గలు ప్రత్యయమును నిత్యముగను అగును.

ఈపదంబులయందిది గల ప్రత్యయము.

| | | |
|---|---|---|
| గానుఁగ | గానుఁగలు | త. కాణంగళ్. |
| వెలుఁగ | వెలుఁగలు | ,, విళగళ్. |

వీనియందు గలు ప్రత్యయము.

ఇట్లు లు, ళ్లు, గలు, గళు ప్రత్యయములచే సిద్ధించిన రూపములలో కకారగకారములు ఏకవచన ప్రాతిపదికలలోఁ జేర్చి మిగిలిన అలు ఉలులను బహువచన ప్రత్యయములుగా వైయాకరణులు గ్రహించుట చేత ఏకవచనమునందు లేని రూపములు సిద్ధించినవి. పైఁజెప్పినపదముల ఏకవచనరూపములను జూడుఁడు.

151. ల్లుకారాంత లికారాంత నామములకు లు ప్రత్యయము చేరఁగా మొదటి లకారమునకు వైకల్పికము నత్వము అగును.

ఉ. ఇల్లు+లు = ఇన్లు = ఇండ్లు; నలలకు నడుమ దకారాగమము.

కొడవలి + లు = కొడవన్లు = కొడవండ్లు; పైఁజెప్పినది, డకారమునకును నకారమునకును నడుమ ఉకారము రాఁగా ఇండులు కొడవండులు అను రూపములు వచ్చును.

పై శబ్దములకు ఉలు ప్రత్యయము చేరఁగా ఇల్లులు, కొడవలులు, కొడవళులు, కొడవళ్లు ఇల్లులు అను రూపములు వచ్చును.

ఇట్లు కల్లు, పల్లు; ముల్లు, విల్లులకు రూపం బెఱుంగునది.

152 రాశి, వేశి, పరదేశి, రాజీ, వాజీ, రోచి, పీచి మొదలగు వానికి ఉలు ప్రత్యయము పరమగునప్పుడు వానియందలి తాలవ్య హల్లులకు దంత్యములు ఆదేశములగును.

ఉ. రాసులు, వేసులు, పరదేసులు, రాజులు, వాజులు, రోచులు, పీచులు, ఇత్యాదులు.

153 కూఁతుశబ్దమునకు రువర్ణంబంతాగమంబుగనగు.

ఉ. కూఁతురు ఈశబ్దము అరు ప్రత్యయము చేరిన బహువచనము. ఏకవచనముగాఁ గ్రహింపఁబడుటచేత దానికి బహువచన ప్రత్యయము తిరిగి చేర్పఁబడెను.

154. కొన్ని పదములందు బహువచనప్రత్యయముల యందుండెడు రు లు లకు ళకారాదేశమగును.

ఉ. పగతురులు = పగళు. ఇందరులు = ఇందళు.
వేఁటకారులు = వేఁటకాళు. ఎందరులు = ఎందళు.
అందరులు = అందళు. కొందరులు = కొందళు.

155. చెయ్వాలు అనుపదమునకు ఉలు ప్రత్యయము రాఁగా లకారములకు లోపమును రెండు లకారములకును ళకారంబును ఆదేశంబగు.

ఉ. చెయ్వాళు = చెయ్వాలు + ఉలు. చెయ్వాలు అనునది ఉలు ప్రత్యయాంతమయిన బహువచనరూపము. దానితో ఉలు ప్రత్యయము తిరిగి చేర్పఁబడినది.

156. కొన్ని పదంబులందు రులు ప్రత్యయముల రేఫలకారములకు సంయోగము రాఁగా ఆ రేఫ లకారములకు నకార రేఫములు క్రమముగా ఆదేశము లగును. ఆ నకార రేఫములకు నడుమ డకార మాగమమును వచ్చును.

ఉ. వారు = వాండ్రు + వారు + ఉలు = వార్ + లు =
వారు. రకారమునకును నకారము.
వాన్ + రు = వాన్ + డ్ + రు =
వాండ్రు. ఉలు ప్రత్యయము యొక్క
ఆద్యుకారమునకును వారు శబ్దము
యొక్క అంత్యుకారమునకును
లోపము.

వాఁడు శబ్దమునకు రు ప్రత్యయము రాఁగా
వాండ్రు అని వచ్చినది అని చెప్పినను
తగును. కొన్నిపదములందు అవండ్రు
అను బహువచనము జూడుము.

157. ఆల్వాదులకు ఉరు ప్రత్యయంబు బహువచనమునందగును. పదాంత ప్రత్యయాద్యుకారములకు లోపమును పూర్వ లకారమునకు నకారాదేశంబును అగును. నకార లకారములకు రెంటికి నడుమ డకార మాగమము నగును.

ఉ. ఆండ్రు = ఆలు + ఉరు = అల్ + రు = అన్ +
డ్ + రు. ఇట్లు చెలియలు - చెలి
యండ్రు, చెల్లెలు - చెల్లెండ్రు, కోడలు-
కోడండ్రు, మఱఁదలు - మఱఁదండ్రు,

161. ఉలుప్రత్యయాకారము లోపింపఁగా లకారము ళత్వమును బొందును.

ఉ. త్రాళ్లు, కొమ్మళ్లు, మొగ్గళ్లు, గోళ్లు, వీళ్లు,

162. చేను, మీను, పేను, రేయి, వ్రాయి, పేయి, తాయి ఈశబ్దముల యంత్యవర్ణములకును ఉలు ప్రత్యయముయొక్క మొదటి ఉకారమునకు లోపమగును.

ఉ. చేను + ఉలు = చేలు. వ్రాయి + ఉలు = వ్రాలు.
మీను + ఉలు = మీలు. పేయి + ఉలు = పేలు.
పేను + ఉలు = పేలు. తాయి + ఉలు = తాలు.
రేయి + ఉలు = రేలు. తాయిశబ్దమునకు త్రాళ్లు అనియు రూపము కలదు.

163. ఆవు, జాము, మీసము, చుట్టము, ఈశబ్దములకు పైచెప్పిన లోపము వికల్పముగానగు.

ఉ. ఆవు + ఉలు = ఆలు, ఆవులు.
జాము + ఉలు = జాలు, జాములు.
మీసము + ఉలు = మీసలు, మీసములు.
చుట్టము + ఉలు = చుట్టలు, చుట్టములు.

164. నపుంసకైక వచనమయిన అము ప్రత్యయమునకు ఇన్ ప్రత్యయము నకారమును ఉలుప్రత్యయమును పరములగు నపుడు ముకారమునకు లోపమును దానికి పూర్వమయిన అచ్చునకు దీర్ఘమును పాక్షికంబుగ నగును.

ఉ. దినమునన్ దినానన్ వజ్రములన్ వజ్రాలన్.
దినములు దినాలు పగడమునన్ పగడానన్.
దినములన్ దినాలన్ పగడములు పగడాలు.
వజ్రమునన్ వజ్రానన్ పగడములన్ పగడాలన్.
వజ్రములు వజ్రాలు శతమునన్ శతనన్
దీనికి దీర్ఘంబు లేదు.

ఇన్ప్రత్యయముయొక్క ఇకారమునకును ఉఃప్రత్యయముయొక్క ఉకారమునకు లోపము.

ఇన్ప్రత్యయము షష్ఠీవిభక్తి ప్రత్యయముగా వచ్చుచున్నది. అరవమునందును దినమునన్ అను రూపమునకు సరియగు 'దినత్తినాల్' అనునది వచ్చుచున్నది. దినత్తినాల్ = దినత్తు + ఇన్ + ఆల్. అట్లే దినమునన్ = దినము + ఇన్ + అన్ = దినమునన్.

ఈసూత్రముచే మీసము చుట్టము శబ్దముల ముకారమునకు లోపమును దాని పూర్వాచ్చునకు దీర్ఘమును వైకల్పికముగ నగు.

ఉ. చుట్టములు = చుట్టాలు.
మీసములు = మీసాలు. పైసూత్రముచే మీసలు చుట్టలు అనియు రూపములు గలవు.

165 గోయి మొదలగువానికి ఉలుప్రత్యయము పరముకాఁగా యకారమునకు తత్వము.

గను ను ప్రత్యయమునకు పూర్వరూపముగను, ఈ ఇప్రత్యయము నకు అత్వము వైకల్పికము.

బహువచనమందు అలు ఉలు అంతమందుఁ గలిగిన శబ్దములు ఆకారాంతములుగను, అనుప్రత్యయమును తజ్జన్యము యిన వురు గారు మొదలయిన ప్రత్యయములును అంతమందుఁ గలిగినవి అకారాంతములుగను ఇకారాంతములుగను నుండును.

ఈ విభక్తి ప్రాతిపదికములన్నియు షష్ఠ్యంతనామములు. అంతమునందు అకార ఇకారములు షష్ఠీవిభక్తి ప్రత్యయములు. అకారము కన్నడమందును అరవమునందును వచ్చును.

| | క. | త. |
|---|---|---|
| ఉ. | రామున | రాముని. |
| | రామర | రామ[illegible]. |
| | అవన | వాని. |
| | అవర | వారి. |
| | అతన | అతని. |

| ఏకవచనము. | | బహువచనము. |
|---|---|---|
| రామునిచేతన్ | రాముచేతన్ | రాములచేతన్ |
| రామునికి | | |
| రామునకు | | రాములకు |
| రామునియొక్క | రాముయొక్క | రాములయొక్క |
| బల్లిదునిచేతన్ | బల్లిదుచేతన్ | బల్లిదులచేతన్ |
| బల్లిదునికి | | |
| బల్లిదునకు | | బల్లిదులకు |

బల్లిదునియొక్క బల్లిదుయొక్క బల్లిదులయొక్క
మగనిచేతన్ మగలచేతన్
మగనికి మగలకు
మగనియొక్క మగలయొక్క
బాలునిచేతన్ బాలుచేతన్ బాలురచేతన్
బాలునికి
బాలునకు బాలురకు
బాలునియొక్క బాలుయొక్క బాలురయొక్క
పగతునిచేతన్ పగతుచేతన్ పగతురచేతన్
పగతునికి
పగతునకు పగతురకు
పగతునియొక్క పగతుయొక్క పగతులయొక్క
గురువుచేతన్ గురువులచేతన్
గురునిచేతన్ గురుచేతన్ గురులచేతన్
గురువునకు
గురునకు గురువులకు
గురునికి గురులకు
గురువుయొక్క గురువులయొక్క
గురునియొక్క గురుయొక్క గురులయొక్క
పలువురచేతన్
పలువురకు
పలువురయొక్క

రాముచేతన్ మొదలయిన పదములలో ఇ ప్రత్యయమునకును తత్పూర్వమయిన నకారమునకు లోపము.

మగనకు అని కు ప్రత్యయమునకు పూర్వము అకారము రాదు.

| | |
|---|---|
| విష్ణువుచేతన్ | విష్ణునిచేతన్ * |
| విష్ణువందు | విష్ణునందు |
| | విష్ణునియందు. |

170. సర్వనామంబులలో విభక్తిప్రాతిపదికములు ఏకవచనమునందు ఇకారాంతములుగను, బహువచనమునందు అకారాంతముగను ఇకారాంతములుగను ఉండును

| | | | |
|---|---|---|---|
| వాఁడు, | వానిచేతన్, | వానికి, | వానియొక్క. |
| వీఁడు, | వీనిచేతన్, | వీనికి, | వీనియొక్క. |
| ఎవఁడు, | ఎవనిచేతన్, | ఎవనికి, | ఎవనియొక్క. |
| అది, | దానిచేతన్, | దానికి, | దానియొక్క. |
| ఇది, | దీనిచేతన్, | దీనికి, | దీనియొక్క. |
| ఏది, | దేనిచేతన్, | దేనికి, | దేనియొక్క. |
| వారు, | వారిచేతన్, | వారికి, | వారియొక్క. |

* విష్ణుని మొదలయిన రూపంబులందు ఉండు నకారము రాముని కృష్ణుని మొదలయినవానియందు ఉండెడి ప్రత్యయములోని అనుస్వార సంబంధమయినట్లు (రాముండు + ఇ = రాముని + ఇ = రామున్ + ఇ; డులోపము), విష్ణుఁడు అని దాని ఉండు ప్రత్యయమునకు సంబంధించినది (అనఁగా విష్ణుఁడు + ఇ = విష్ణుని; డులోపము.) అని ఆక్షేపింపఁగూడదు. విష్ణుండు శబ్దమునందుండు ఉండు ప్రత్యయము తరువు మొదలయిన అమహదర్థకోకారాంత నామములకును మహదర్థక మహాశబ్దంబులకును రాకుండుటచేతను, సామాన్యముగా అఱవము కన్నడము ఈభాషలలోను ఉకారాంతశబ్దంబులకు ఉండు ప్రత్యయమునకు ప్రకృతియయిన అన్ అను ప్రత్యయము రామిచేతను, అఱవమునందును కన్నడమునందును సమస్తోకారాంతములకు ఇనాగమము వచ్చుటచేత, విష్ణుని, గురుని మనువునకు తరువునకు మొదలయిన పదంబులందలి నకారము ఇనాగమసంబంధమయినది యని తెలియవలసినది.

| | | | |
|---|---|---|---|
| వారలు, | వారలచేతన్, | వారలకున్, | వారలయొక్క. |
| | వాండ్రచేతన్, | వాండ్రకున్, | వాండ్రయొక్క. |
| వీరు, | వీరిచేతన్, | వీరికి, | వీరియొక్క. |
| వీరలు, | వీరలచేతన్, | వీరలకున్, | వీరలయొక్క. |
| ఎవరు, | ఎవరిచేతన్, | ఎవరికి, | ఎవరియొక్క. |
| ఏవారు, | ఏవారిచేతన్, | ఏవారికి, | ఏవారియొక్క. |
| ఏవారలు, | ఏవారలచేతన్, | ఏవారలకున్, | ఏవారలయొక్క. |
| అందఱు, | అందఱచేతన్, | అందఱకున్, | అందఱయొక్క. |
| | అందఱిచేతన్, | అందఱికి, | అందఱియొక్క. |
| ఇందఱు, | ఇందఱచేతన్, | ఇందఱకున్, | ఇందఱయొక్క. |
| | ఇందఱిచేతన్, | ఇందఱికిన్, | ఇందఱియొక్క. |
| ఎందఱు, | ఎందఱచేతన్, | ఎందఱకున్, | ఎందఱయొక్క. |
| | ఎందఱిచేతన్, | ఎందఱికి, | ఎందఱియొక్క. |

దాని, దీని, దేని అనుపదంబులందు ఏకవచనంబున అన్ ఇ ప్రత్యయములు రెండును చేరి వచ్చినవి.

దాని = అ. అదన్ + ఇ

= దాని. క. అదర

దీని = అ. ఇదన్ + ఇ

= దీని. క. ఇదర

దేని = అ ఎదన్ + ఇ

= దేని. క. ఎదర

తెనుంగుపదంబులందు ఇ ప్రత్యయము అధికముగా వచ్చినది.

171. కొన్ని విభక్తిప్రాతిపదికములందు ఏకవచనము నందు పైఁజెప్పిన ఇ ప్రత్యయము రాఁగా పదాంతహల్లులు మాఱును.

త్రాడు, త్రాటిచేతన్, త్రాటియొక్క.
కాడు, కాటిచేతన్, కాటియొక్క.
నోరు, నోటిచేతన్, నోటియొక్క.
నీరు, నీటిచేతన్, నీటియొక్క.
నూఱు, నూటిచేతన్, నూటియొక్క.
కన్ను, కంటిచేతన్, కంటియొక్క.
మిన్ను, మింటిచేతన్, మింటియొక్క.
విల్లు, వింటిచేతన్, వింటియొక్క.
పల్లు, పంటిచేతన్, పంటియొక్క.
వాయి, వాతిచేతన్, వాతియొక్క.
నూయి, నూతిచేతన్, నూతియొక్క.
మన్ను, మంటిచేతన్, మంటియొక్క.
గోరు, గోటిచేతన్, గోటియొక్క.
వీడు, వీటిచేతన్, వీటియొక్క.
ఏఱు, ఏటిచేతన్, ఏటియొక్క.
పగలు, పగటిచేతన్, పగటియొక్క.
ఇల్లు, ఇంటిచేతన్, ఇంటియొక్క.
తాయి, తాతిచేతన్, తాతియొక్క.

ఇట్లు కూడు, నాడు, ప్రోడు, కాడు, గోయి, చేయి, దాయి, రేయి, రోలు, మొదలయినవి.

**172.** కొన్ని విభక్తి ప్రాతిపదికములందు ఏకవచనమునందు ఇ ప్రత్యయమునకు ముందు ప్రాతిపదికమునకు పరంబుగ ఇన్ ప్రత్యయము వచ్చును. ఇదియు షష్ఠీవిభక్తి ప్రత్యయము. కన్నడమునందు ఈ ఇన్ ప్రత్యయమునకు పరముగ అ ప్రత్యయము వచ్చును.

| తె. | ఆ. | క. |
|---|---|---|
| గురుని | గురునిన్ | గురువిన. |
| విష్ణుని. | విష్ణునిన్ | విష్ణువిన. |

173 కొన్ని విభక్తి ప్రాతిపదికములకు ఇన్—టి ప్రత్యయములు రెండును వచ్చునప్పుడు టి ప్రత్యయమునకు ముందు వకారమునకు ద్విత్వమును, రెండవ నకారమునకు టాదేశమును టకారమునకు ముందున్న డకారమునకు బింద్వాదేశమును అగును. ఆదేశబిందువునకును వైకల్పికముగ లోపము.

| | | | |
|---|---|---|---|
| పేరు — | పేరిటిచేతన్ | పేరిటియొక్క | పేరిటియందు |
| | పేరిచేతన్ | పేరియొక్క | పేరియందు |
| | పేరింటిచేతన్ | పేరింటియొక్క | పేరింటియందు |
| పగలు — | పగలిటిచేతన్ | పగలిటియొక్క | పగలిటియందు |
| | పగటిచేతన్ | పగటియొక్క | పగటియందు |
| | పగలింటిచేతన్ | పగలింటియొక్క | పగలింటియందు |
| అన్ని — | అన్నిటిచేతన్ | అన్నిటియొక్క | అన్నిటియందు |
| | అన్నింటిచేతన్ | అన్నింటియొక్క | అన్నింటియందు |
| రెండు — | రెండిటిచేతన్ | రెండిటియొక్క | రెండిటియందు |
| | రెండింటిచేతన్ | రెండింటియొక్క | రెండింటియందు |
| ఏమి — | ఏమిటిచేతన్ | ఏమిటియొక్క | ఏమిటియందు |
| నూఱు — | నూఱిటిచేతన్ | నూఱిటియొక్క | నూఱిటియందు |

నూటి పగటి అను రూపములందు రేఫ లకారములకు టకారాదేశము వచ్చినది 170-వ విధి మూలమున. నూఱిటి పగలిటి అను రూపములందు ఇన్ టి ప్రత్యయములు వచ్చినవి.

ఇట్లు మొదలు, అన్ని, కొన్ని, ఇన్ని, ఎన్ని; మూడు, నాల్గు, మొదలయిన సంఖ్యాశబ్దములు వీని విభక్తిప్రాతిపదికములు వచ్చును.

180. ఉండు ఊఁడు ప్రత్యయములు పాక్షికముగఁ జేర్పఁబడు పుంలింగనామములకు పైఁజెప్పిన రూపములతో వేఱు రూపములును గలవు.

దయాళుండు } దయాళునిన్ సవిత్రుండు సవిత్రునిన్.
దయాళూఁడు }

దయాళువు { దయాళువున్ సవిత్రుఁడు సవిత్రున్.
{ దయాళున్ సవిత సవితన్.

గురుండు } గురునిన్.
గురూఁడు }

గురున్.

గురువు గురువున్.

181. ఉకారము అంతప్రత్యయముగాఁ గలిగిన ఉకారాంత తత్సమశబ్దములకు ద్వితీయయందు ఉన్ ప్రత్యయము పరముకాఁగా, ఆ అంతప్రత్యయమునకును తత్పూర్వమయిన వకారమునకును పాక్షికముగా లోపము.

తరువు తరువున్
తరున్
బాహువు బాహువున్
బాహున్
బిందువు బిందువున్
బిందున్,

దయాళున్ గురున్ మొదలయినవి వులోపముచేత సిద్ధించుచున్నవి. పై సూత్రముచేత దయాళునిన్ గురునిన్ అను రూపములందు నికారలోపముచేతను రావచ్చును.

132. ఇన్ ఇ షష్ఠీవిభక్తి ప్రత్యయములు చేరునపుడు, ఆదేశంబు బొందునట్టి గోయి, వాయి, నోరు, నీరు, మొదలగు నామంబులకు ద్వితీయావిభక్తి ప్రత్యయములు వచ్చునపుడు పైం జెప్పిన ఆదేశము వచ్చును.

| | | |
|---|---|---|
| గోయి | గోతి | గోతిన్ |
| వాయి | వాతి | వాతిన్ |
| నోరు | నోటి | నోటిన్ నోతిన్ |
| నీరు | నీటి | నీటిన్ |
| త్రాడు | త్రాటి | త్రాటిన్ |

133. ప్రథమైకవచనమునందు ను ప్రత్యయము పాక్షికముగం గలిగినకలన్యాదులకు ప్రథమైకవచనమునందువలె రెండు రూపములు ద్వితీయాదులందును ఏకవచనంబునందు గలవు.

కలను
కలంకు } కలనిన్ కలంకిన్.

కొలంకు
కొలను } కొలనిన్ కొలంకిన్.

134. సంబంధార్థకమయిన ఇ ప్రత్యయము రాంగా అన్ ఇనాగమములును, ఇనాగమమునొక్క నకారమునకు టత్వము మొదలయిన కార్యములను కలిగిన నామములకు ద్వితీయావిభక్తి ప్రత్యయము పరమగునపుడు ఇనాగమము మొదలయిన కార్యములు వచ్చును.

| | | |
|---|---|---|
| చేయి | చేయిటి | చేయిటిన్ |
| పేరు | పేరిటి | పేరిటిన్ |
| | పేరి | పేరిన్ |

మడి మడిన్
తుడి తుడిన్

అన్ ప్రత్యయాంతము యొక్క ఆకారమునకు లోపము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| త్రాడు | త్రాటన్, | తృ. | స. | త్రాటిన్ | ద్వి. |
| కన్ను | కంటన్ | ,, | ,, | కంటిన్ | ,, |
| విల్లు | వింటన్ | ,, | ,, | వింటిన్ | ,, |
| చేయి | చేతన్ | ,, | ,, | చేతిన్ | ,, |
| కొడవలి | కొడవటన్ | ,, | ,, | కొడవటిన్ | ,, |
| వేయి | వేయాటన్ | ,, | ,, | వేయిటిన్ | ,, |
| ఱాయి | ఱాతన్ | ,, | ,, | ఱాతిన్ | ,, |
| మేను | మేనన్ | ,, | ,, | మేనిన్ | ,, |
| చేను | చేనన్ | ,, | ,, | చేనిన్ | ,, |
| కలను | కలనన్ | ,, | ,, | కలనిన్ | ,, |
| ఏఁడు | ఏఁటన్ | ,, | ,, | ఏఁటిన్ | ,, |
| గోరు | గోటన్ | ,, | ,, | గోటిన్ | ,, |
| ఊరు | ఊరన్ | ,, | ,, | ఊరిన్ | ,, |
| పేరు | పేరిటన్ | ,, | ,, | పేరిటిన్ | ,, |
| | పేరన్ | ,, | ,, | పేరిన్ | ,, |
| కాడు | కాటన్ | ,, | ,, | కాటిన్ | ,, |
| పగలు | పగలిటన్ | ,, | ,, | పగలిటిన్ | ,, |
| | పగటన్ | ,, | ,, | పగటిన్ | ,, |
| క్రిందు | క్రిందన్ | ,, | ,, | క్రిందిన్ | ,, |
| | క్రిందటన్ | ,, | ,, | క్రిందటిన్ | ,, |
| మీఁదు | మీఁదన్ | ,, | ,, | మీఁదిన్ | ,, |
| | మీఁదటన్ | ,, | ,, | మీఁదటిన్ | ,, |
| అన్ని | అన్నిటన్ | ,, | ,, | అన్నిటిన్ | ,, |
| పెక్కు | పెక్కిటన్ | ,, | ,, | పెక్కిటిన్ | ,, |

| | | | | | |
|---|---|---|---|---|---|
| రెండు | రెండింటన్ | తృ. | ఏ. | రెండిటిన్ | ద్వి. |
| | రెంటన్ | ,, | ,, | రెంటిన్ | ,, |
| మూఁడు | మూఁడిటన్ | ,, | ,, | మూఁడిటిన్ | ,, |
| | మూఁటన్ | ,, | ,, | మూఁటిన్ | ,, |

త్రాటి మొదలయిన ఉదాహరణములందు సప్తమీ ప్రత్యయము అన్ తృతీయార్థమునందును వచ్చును. అన్ ప్రత్యయము చేర్చునప్పుడు వచ్చునట్టి కార్యములు ద్వితీయా ప్రత్యయము అన్ చేర్చునపుడును వచ్చుచున్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 186. | అది | దానన్ | దానిన్ | క. | అదవన్ను. |
| | ఇది | దీనన్ | దీనిన్ | ,, | ఇదవన్ను |
| | ఎది | దేనన్ | దేనిన్ | ,, | ఎదనన్ను |

వీనిలో సప్తమీ ప్రత్యయము అన్, ద్వితీయా ప్రత్యయము ఇన్. ఇవి షష్ఠీ ప్రత్యయమయిన అను ప్రత్యయముతోఁ జేరి వచ్చుచున్నవి సర్వనామ ప్రకరణమున చూడుము.



## సర్వనామప్రకరణము.

157 అ-ఆ, ఇ-ఈ, ఎ-ఏ సర్వనామ విశేషణములు

వాఁడు, వీఁడు, ఎవఁడు, ఏఁడు.
వారు, వీరు, ఎవరు, ఏరు.
అది, ఇది, ఎది.
అవి, ఇవి, ఏవి.
ఈవు, నీవు.
మీరు, మీరలు, ఈరు, ఈరలు.
నేను, ఏను.
ఏము, మేము, నేము, మనము.

అన్ని, ఇన్ని, కొన్ని, అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు, పెక్కు, పెక్కులు, పలువురు, పెక్కురు, పెక్కుండ్రు), అట్టి, ఇట్టి, ఎట్టి, అట్టివాఁడు, అట్టివారు, ఇట్టివాఁడు, ఇట్టివారు, ఎట్టివాఁడు, ఎట్టివారు, అట్టిది, అట్టివి, ఇట్టిది, ఇట్టివి, ఎట్టిది, ఎట్టివి, అంత, ఇంత ఎంత, కొంత.

188. వాఁడు = అ - అవన్. అవన్ + ఉ = అవన్ + డ్ + ఉ = అవండు = వాండు = వాఁడు. డకారాగమమున నకారమునకు అనుస్వారాదేశమును వెనుక ఖండాదేశమును వచ్చినవి.

ఇట్లు, వీఁడు = అ. ఇవన్ + డ్ + ఉ. ఇ + అన్ = ఇయన్ అని యకారము రావలసినది. దానిస్థానమున అవన్ అనుశబ్దము యొక్క సామ్యముచేత ఇయన్ ఇవన్ అని వచ్చెను.

ఎవఁడు = అ. ఎవన్ + డ్ + ఉ.

ఏ + అన్ = ఏవణ్ అని ఉండవలసినది. ఏవణ్ అని పైశబ్దము సరి వకారముతో వచ్చినది

అది - అ. అవణ్ + ఇ = అవ్ + ఇ + అది. అన్లోపమును వకారమునకు దకారాదేశమును వచ్చినవి. క్రియాప్రకరణములోను అది ప్రత్యయమును చూడుము.

ఇట్లే - ఇది = అ. ఇవన్ + ఇ = ఇవి = ఇది.

ఏది = అ. ఎవన్ + ఇ = ఎవి = ఎది

ఈ అది ఇది ఎది, అను పదములు స్త్రీలింగమునందు వచ్చెడు ఇ ప్రత్యయమును అవన్ మొదలయిన పదములకు చేర్చుటచేత వచ్చినవి. ఇవి వేఱు నపుంసకలింగమునందు వచ్చెడు అది మొదలయిన శబ్దములు వేఱు

వారు = అ - అవర్ + ఉ.

అది = అ. అదు. అదు యొక్క ఉకారమునకు ఇత్వము.

అవి = అ. అవై. అవై యొక్క ఐకారమునకు ఇత్వము.

169. నీవు } ప్రాతత-ఈణ్ + ఉఞతోను. ప్రా. క. ఈమ్ ఏకవచన
ఈవు } బహువచనములకును వచ్చును. దీనికి నకారాగమము ఆదియందు రాఁగా నీమ్ అనివచ్చును.

ఈ నీమ్ అనునది అఱవములో మీరు అను అర్థములో వచ్చును. ఇది అఱవములో చింతామణి అను ప్రాచీన గ్రంథములో ప్రయోగింపఁబడి యున్నది. ప్రాచీన కన్నడమునందు నీమ్ అను సర్వనామము, మకారము నకారమగుటచేతను నీను అని వచ్చినది. తెనుంగునందు ఆ మకారమునకు వకారాదేశంబు

మనము — మా౯ శబ్దమునకు అము అను ఉత్తమపురుష బహువచన ప్రత్యయముఁ జేర్చి దీర్ఘమును హ్రస్వము చేయఁగా నము అని వచ్చి వర్ణవ్యత్యయముచేత మనము అగును.

మన — మా౯ శబ్దమునకు అ అను షష్ఠీవిభక్తి ప్రత్యయమును ఆకారమునకు హ్రస్వమును రాఁగా నమ అనివచ్చును. అ. నమ్, క. నమ్మ. వర్ణవ్యత్యయముచేత నమ మన ఆయినది.

మాపుస్తకము, మాది, మాయది, మనపుస్తకము, మనది.

191. అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని.

ఇవి సర్వనామవిశేషణములు; సమదాయార్థకములు.

అ. అన్నై, క. అని.
,, ఇన్నై, ,, ఇని.
,, ఎన్నై, ,, ఎని.

ఇవి నిత్యబహువచనంబులు. మహదర్థకమునందు వరు ప్రత్యయము చేర్పఁగా, అనివరు, అ. అన్నైవర్, క. అనిబరు, అన్నైవరు=అన్వరు. ఐలోపము. అందరు, వకారమునకు దకారము. నకారమున కనుస్వారము.

అందరు అనుదానికి ఉ ప్రత్యయముచేర్చి ర ల లకు అకారాగమమును చేయఁగా 'అందఱు.' అందరు+ఉ=అందఱు.

అకారమునకు పూర్వమందుండు అకారమునకు ఒత్వము పాక్షికముగా వచ్చినయెడల 'అందొఱు'.

ఇట్లె ఇనివలన, 'ఇందఱు, ఇందొఱు;' ఎనివలన 'ఎందఱు, ఎందొఱు.'

కొందఱు — అ. కిల, క. కెల. వీనికి సంబంధము లేదని తె. కొన్ని. క. కెల అనునది అని, ఇని, ఎని పదముల సామ్యముచేత

పెక్కున్రు. నకారరేఫములకు
నడుమ దకారాదేశము రాఁగా
పెక్కండ్రు.

పెక్కు } — ఆ. పలశబ్దమునకు ఉలు ప్రత్యయముచేర పల
పెక్కులు } పలు. అకారముతోఁ జేరిన అకారమునకు ఉత్వము
రాఁగా, పలువులు, పల్గులు, పెక్కులు, కడపటను
పెక్కులు పైశబ్దమువలె వచ్చినది.

ఈశబ్దంబునందు కు లు అనునది బహువచన ప్రత్యయ
ము. వైయాకరణులు ఉలు అనుభాగమును బహువచన
ప్రత్యయముగా గ్రహించుటచే. పెక్కు అనిభాషలో
లేనిరూపము ఏకవచనమునకు సిద్ధించెను. కలఁకు,
గవఁకు మొదలగునశబ్దములను చూడుము.

అంత— ఆ. అనై అను సర్వనామ విశేషణమునకు నపుం
సక బహువచన ప్రత్యయమయిన ఆకారమును చేర్ప
అనైయ అనునది వచ్చును. ఇది సంక్షేపముచేత
అన్న అగును; దీనికి అవయములో అటుకంటివి, అప్ర
మాణము కలిగినవి అని యర్థము, అన్నశబ్దమురెండుక్కు
రెండవనకారమునకు తాదేశమును మొదటి నకారము
నకు అనుస్వారాదేశమునురాఁగా అంత అయినది.

ఇంత— ఆ. ఇనైయ - ఇన్న, తె. ఇంత.

ఎంత— ,, ఎనైయ - ఎన్న, తె. ఎంత.

కొంత— కొన్ని శబ్దముకలన అంత ఇంత శబ్దముల సాదృశ్య
ముచేఁ బుట్టినది.

కొన్ని + అ = కొన్న = కొంత.

అట్టివాఁడు } అట్టిఁడు — అట్టి. సర్వనామ విశేషణము. వాఁడు ప్రత్యయము. అట్టివాఁడు=అట్టివఁడు = అట్టియఁడు= అట్టిఁడు.

ఇట్లు ఇట్టివాఁడు, ఇట్టిఁడు, ఇట్టివారు, ఇట్టిరు, ఎట్టివాఁడు, ఎట్టిఁడు, ఎట్టివారు, ఎట్టిరు, అట్టివారు, అట్టిరు.

అట్టిది } అట్టివి — అట్టి + అది = అట్టిది. అట్టి + అవి = అట్టివి.

ఇట్లు ఇట్టిది, ఎట్టిది, ఇట్టివి, ఎట్టివి.

అలవాఁడు — అ. అన్నియు అను విశేషణము అన్న అగును. దీనియందలి నకారద్విత్వమునకు లకారాదేశంబు రాఁగా అల అని వచ్చును. దానికి వాఁడు ప్రత్యయము చేరఁగా అలవాఁడు,

అలఁది — అల + అది.

అలవారు — అల + వారు. ఎల్లపదమును చూడుము.

తాను — ప్రా. క. తామ్ శబ్దము ఏకవచన బహువచనములకు సామాన్యము. ఉ ప్రత్యయమును మకారమునకు నకారాదేశమును రాఁగా, తాను అని సిద్ధించినది, నేను, నేము చూడుము.

తాము — ఉ ప్రత్యయము మాత్రము.

తమరు — తాము + అరు = తామరు, ఆకారమునకు హ్రస్వము.

తారు — తమరు.

తన్నుఁ } తమ్ముఁ — ద్వితీయా ప్రత్యయమునకును షష్ఠీ ప్రత్యయమైన అకారమునకును ముందు తాను తాము శబ్దముల ఆకారమునకు హ్రస్వాదేశము.

తన—తాను + అ.

తము—తాను + అ.

| | |
|---|---|
| ఎల్లవారు<br>ఎల్లరు<br>ఎల్ల | అ. అనైవర్ (తె. అందఱు) అనుపదముతో ప్రాతిపదికమంతన అనై అనుపదము అన్ల, అల్ల, ఎల్ల అని వికృతమయి సమస్తము అనే అర్థములో మపయోగింపఁబడుచున్నది. దానికి వారు ప్రత్యయము చేరఁగా ఎల్లవారు వచ్చుచున్నది. |
| | అ. ఎల్లార్. ఎల్లరు శబ్దమునందు అరు ప్రత్యయము చేర్పఁబడుచున్నది. |

192. విభక్తిరూపములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| వాఁడు | వారు | వారలు | వాండ్రు | | ప్ర. |
| వానిన్ | వారిన్ | వారలన్ | వాండ్రన్ | | ద్వి. |
| వాని | వారి | వారల | వాండ్ర | విభ. | ప్రా. |
| వీఁడు | వీరు | వీరలు | వీండ్రు | | ప్ర. |
| వీనిన్ | వీరిన్ | వీరలన్ | వీండ్రన్ | | ద్వి. |
| వీని | వీరి | వీరల | వీండ్ర | విభ. | ప్రా. |
| ఎవఁడు | ఎవరు | | ఎవండ్రు | | |
| ఏఁడు | ఏరు | | | | |
| వేఁడు | వేరు | ఎవఁడు యొక్క వర్ణవ్యత్యయరూపములు | | | |
| ఏవాఁడు | ఏవారు | ఏవారలు | ఏవాండ్రు. | | |
| ఎవ్వాఁడు | ఎవ్వారు | ఎవ్వారలు | ఎవ్వాండ్రు. | | |
| ఎవ్వఁడు | ఎవ్వరు | ఎవ్వండ్రు | | | |
| ఏని | ఏరి | | | | |
| ఎవని | ఎవరి | | | | |
| వేని | వేరి | | | | |
| ఏవాని | ఏవారి | ఏవారల | ఏవాండ్ర | విభ. | ప్రా. |

ఎవ్వాని ఎవ్వారి ఎవ్వారల ఎవ్వాండ్ర.

ఎవని ఎవరి ఎవ్వండ్ర.

ఇట్లే ఇతర విభక్తులను ఊహించుకొనవలయు.

అది, స్త్రీలింగము.

దీనికి ఏకవచన రూపములు. ఒకతి (ఒరు + అది = ఒర్వది = ఒక్కతి) అను శబ్దమునుండి, ఒకతెని, ఒకతెయొక్క, ఒకతె చేతన్ మొదలయిన రూపములు వచ్చినట్లు అదెని, అదెయొక్క అనిరూపములు కావలెను. అట్లుగాక అరవ నపుంసకలింగమయిన అను శబ్దమునుండి వచ్చిన అది అనుదానికి వచ్చినట్లు దాని, దానిన్, దానిచేత, దానియొక్క అని రూపములు వచ్చును. ౧౫౯వ విధిని చూడుము.

| | | |
|---|---|---|
| అది | అవి | |
| అద్ది | అవ్వి | ప్ర. |
| ఆయది | ఆయవి | |
| అయ్యది | అయ్యవి | |

దానిన్, ఆదానిన్, అద్దానిన్ } వానిన్ ద్వి.

దాని, ఆదాని, అద్దాని } వాని. విభక్తి షష్ఠి.

## ఇది శబ్దము.

| | | |
|---|---|---|
| ఇది | ఇవి | |
| ఇద్ది | ఇవ్వి | ప్ర. |
| ఈయది | ఈయవి | |
| ఇయ్యది | ఇయ్యవి | |

దీనిన్, ఇద్దానిన్, ఈదానిన్ వీనిన్ ద్వి.

దీని
ఇద్దాని } వీని విభ. షా)
ఈదాని

దీనఁ సప్తమీవిభక్తి ప్రత్యయము అఁ.

ఏదిశబ్దము.

ఏది, ఎది, ఎద్ది — ఏవి, ఎవి, ఎవ్వి } ప్ర.
ఏయది, ఎయ్యది — ఏయవి, ఎయ్యవి
దేనిని, ఏదానిని, ఎద్దానిని — వేనిని ఏవానిని ఎవ్వానిని ద్వి.
దేని — వేని
ఏదాని — ఏవాని } విభ. షా)
ఎద్దాని — ఎవ్వాని

ఏదానఁ, ఎద్దానఁ సప్తమీప్రత్యయము అఁ.

నీవు శబ్దము

ప్ర. నీవు — మీరు, ఈరు.
ఈవు — మీరలు, ఈరలు.
ద్వి. నిన్నుఁ — మిమ్ముఁ.
నినుఁ — మిముఁ.
నీ — మీ. విభ షా)

నకారద్వయములోను మకారద్వయములోను ఒకటికి లోపము.

నీ — మీ. సమస్తషష్ఠి

నేను శబ్దము.

ప్ర. నేను — మేము.
ఏను — ఏము.
నేము, మనము,
ద్వి. నన్నుఁ — మమ్ముఁ.
ననుఁ — మముఁ.
నా — మా, మన.

## అన్ని శబ్దము.

దీని విభక్తిప్రాతిపదికమునకువచ్చు ప్రత్యయములు ఇన్, ఇ. ఇన్ప్రత్యయము నకారమునకు ద్విత్వము. రెండవనకారమునకు టత్వమును మునుకటి నకారమునకు బిందాగమమును అగును. ఈబిందువునకు పాక్షికముగ లోపము.

అన్ని + ఇన్ + ఇ = అన్నిన్ని.
= అన్నింటి.
= అన్నిటి. బిందువునకు పాక్షిక [లోపము.
అన్నింటిన్.
అన్నిటిన్.
అన్నింటన్.
అన్నిటన్.

ఇట్లు, ఇన్ని - ఇన్నింటి.
ఇన్నిటి.
ఎన్ని - ఎన్నింటి.
ఎన్నిటి.
కొన్ని - కొన్నింటి
కొన్నిటి, మొదలగునవి.

అంత - అంతన్ - అంతకు - అంతలోన్.
ఇంత - ఇంతన్ - ఇంతకు - ఇంతలోన్.
ఎంత - ఎంతన్ - ఎంతకు - ఎంతలోన్.
కొంత - కొంతన్ - కొంతకు - కొంతలోన్.

## తాను శబ్దము.

తాను - తాము, తమరు, తారు.
తాన్నున్ - తమ్మున్.
తనన్ - తమన్.
తన - తమ.

## సంఖ్యావాచకప్రకరణము.

192. ఒండు = అ. ఒన్రు, క. ఒందు. ఒంటరియొక్క దకారమునకు టత్వము.

ఒకటి = ఒరుకడి - ఒరు-ఒకటి. అది నపుంసకప్రత్యయము.
= ఒక్కడి. ఉల్లోపము.
= ఒక్కటి. రేఫపకారములకు కద్వయము, దకారమునకు టత్వము.

రెండు = అ. ఇరండా, వర్ణవ్యత్యయవిధిచేత ఇకారము రేఫమునకు పరముగావచ్చి ఎకారమయ్యె.

మూఁడు = అ. మూన్రు అకారమునకు డత్వము. నకారమునకు అర్ధబిందువు.

నాల్గు = అ. నాన్గు. దీనియందలి గకారమునకు పూర్వమందున్న లకారము సహజము. అట్లు వచనమందు మాత్రము దానికి నత్వము.

ఐదు / అయిదు = అ. ఐందు. అనుస్వారమునకు లోపము. అనుస్వారస్థానములో నర్ధానుస్వారముండవలసినది విడువఁబడినది. ఐకారమునకు అయి ఆదేశము.

ఆఱు = అ. ఆఱు.

ఏడు = అ. ఏఱు. ఱకారమునకు డత్వము.

ఎనిమిది = అ. ఎణ్ఱు. కడపటి ఉకారమునకు ఇకారాదేశము. దానినిబట్టి వర్ణసమీకరణవిధిచే అకారమున కిత్వము, ణకారమునకు నాదేశము, ఱకారమునకు మాదేశము,

నకారమునకు వెనుక ఇకారాగమము. ఎను బది యనునర్థము కలిగిన తొంబది యను పదమునకు ఏడునొకటియను నర్థము ప్రయోగముచేత సిద్ధించెను.

తొమ్మిది = అ. తొన్బదు. ఒన్బదు యొక్క మారు రూపము. తొల్ అనఁగా పూర్వము. పదు = పది. పదికి పూర్వముండునది.

పది = అ. పత్తు.

పదునొకటి = అ. పదికొన్ఱు. పత్తుశబ్దమునకు సరియైన పదుశబ్దమునకు ఇక్ ప్రత్యయము వెనుక, తోడ అను నర్థమునందువచ్చినది. 'పది సంఖ్యకు పైన నొకటి' అని యర్థము. ఇప్ప్రత్యయము యొక్క ఇకారమునకు లోపము. ఒన్నుస్థానములో నొకటి.

పండ్రెండు = అ. పన్నిరండు=పన్రెండు. అ. ఇరెండుకు బదులు తె. రెండు. పన్+డ్+రెండు. నకార రేఫములకు నడుమ దకారము నకారమునకు బిందాదేశము. 47-వ విధిని చూడుము.

పదుమూఁడు = పది+మూఁడు. వర్ణసమీకరణవిధిచేత దకారముతోఁ జేరిన ఇకారమునకు ఉత్వము.

పదునాల్గు = పది+నాల్గు. ఉత్వము పైఁజెప్పినట్లు. పన్రెండు మొదలయినవానిలో ఇక్ ప్రత్యయము లోపించినది.

పదునేను = అ. పదినైందు. పదిన్+ఏను = పదునేను. ఉత్వము పైఁజెప్పినట్లు.

పదునాలు = అ. పదినాలు. ఇత్తున ఉత్వము.

పదునేడు = అ. పదినేళు.

పదునెనిమిది = అ. పదినెట్టు. ఎట్టుస్థానములో ఎనిమిది

పందొమ్మిది = పది+తొమ్మిది=పన్‌తొమ్మిది = పందొమ్మిది. పదియొక్క దకారమునకు నత్వము. నకారమునకు పరమైన తకారమునకు దత్వము. నకారమునకు బిందాదేశము.

ఇరువది = ఇరు పది. అ. ఇరండు సమాసమునందు ఇరు అని రూపము. పకారమునకు వత్వము.

ఇరువదియొకటి = ఇరువది+ఒకటి.

ముప్పది = మూఁడుపది. సమాసమునందు మూఁడునకు అంత్యవర్ణలోపము రాఁగా మూ అని రూపము. మూ+పది = మూప్పది. ఊకారమునకు హ్రస్వము. పకారమునకు ద్విత్వము.

నలువది = నాల్గుపది. నాల్గు సమాసమునందు అంత్యవర్ణలోపము. ఆకారమునకు హ్రస్వము. పకారమునకు వత్వము.

ఏఁబది = ఐందుపది. ఐందుయొక్క అంత్యదుకారమునకు లోపమును, ఐకారమునకు ఏకారాదేశమును, పకారమునకు బత్వమును, అనుస్వారమునకు ఖండమును రాఁగా ఏఁబది.

అఱువది = ఆఱు పది. ఆఱుయొక్క ఆకారమునకు హ్రస్వము. పకారంబునకు వకారంబు.

డెబ్బది = ఏడుపది. వర్ణవ్యత్యయముచేత ఏకారము దకారమునకు వెనుకవచ్చి ఉకారమునకు

ఆదేశముకాఁగా డేఁబది అనివచ్చినది. ఏకా
రమునకు హ్రస్వమును, బకారమునకు ద్విత్వ
ము మరాఁగా డెబ్బదియని వచ్చినది.

ఎనుఁబది = ఎణ్ బదు. ఉత్తునకిత్వము. ణకారమునకు
నాదేశము. నకారమునకును బకారమునకును
నడుమ ఉకారాగమము.

తొంబది = తొన్ పది. అ తొల్ కది. ఎనిమిదికి ఎనుఁబది
సంబంధించి యున్నట్లు, తొమ్మిదికి తొంబది
సంబంధించియున్నది. తొంబది అనునది
తొమ్మిది పదికి వచ్చుట ప్రయోగముచేత
సిద్ధించును. ఎనిమిది చూడుము.
ఇరువది మొదలయినపదంబులయందు పదిశబ్ద
ము గ్రామ్యమునందు చేస్తది, వస్తది, చేస్త
యి, వస్తయి అని వచ్చినట్లు, పయి అని
ఏకారమునుబొంది, కయి అనుదానికి ఐకా
రాదేశము వచ్చుటచేత పై అగును.

ఉ. ఇరువై, ముప్పై, నలభై, యాభై, అఱువై, డెబ్బై, ఎనభై,
తొంభై. పకారమునకు వకారమును భకారమును కొన్ని
చోటుల నాదేశము.

నూఱు = అ. నూఱు.

వేయి = సం. సహస్రమ్, ప్రాకృ. సాహిరం, ఈ
కన్నడపదమునందు మొదటి సకారమునకు
లోపమును రెండవదానికి యత్వమునురాఁగా,
ఆయిరం. దీనికి అంత్యాక్షరలోపమును
ఆదియందు వకారాగమమును, ఆకారము
నకు ఏత్వమునురాఁగా, వేయి సిద్ధించును.

## సంఖ్యేయగాను ప్రకరణము

ఒక్కఁడు = అ. ఒరువన్ + ఉ = ఒరువన్ + డ్ + ఉ = ఒరువండు = ఒర్వండు = ఒక్కండు, రేఫవకారములకు కద్వయాదేశము. కకారమునకు లోపము పాక్షికము, ఒకఁడు.

ఓర్తి = అ. ఒరువన్+ఇ=ఒరువ్+ఇ = ఒర్వ్+ఇ, ఓర్వి=ఓర్తి. అన్లోపము. రేఫముతోఁ జేరిన ఉత్తునకులోపము. దానికి పూర్వమైన ఒకారమునకు దీర్ఘము. వకారమునకు తకారము. (అ. ఒరుత్తి.)

ఒక్కతె
ఒక్కతి }
= ఒరువది,
= ఒర్వది,
= ఒక్కది, రేఫవకారములకు కద్వయము.
= ఒక్కతి, దకారమునకు తత్వము.
= ఒక్కతె. ఇత్తునకు ఎత్వము.

ఒక్కటి = ఒక్కదియందు దకారమునకు టత్వము.

ఇద్దఱు
ఇరువురు
ఇరుగురు }
= ఇరువ్వరు = ఇరువ్వురు. వర్ణసమీకరణవిధిచే తవకారముతోఁ జేరిన అత్తున కుత్వము.
= ఇరుగురు. వకారమునకు పాక్షిక గత్వము.
= ఇరువరు = ఇర్వరు = ఇవ్వరు. రేఫముతోఁ జేరిన ఉకారమునకు లోపము.

= పదుగురు; వకారమునకు గత్వము.

= పదువురు = పదురు. వులోపము.

ఇరువండ్రు = ఇరు + పది + వరు = ఇరుపదువురు = ఇరుపదురు = ఇరువదురు = ఇరువండ్రు. పది ఇకారమునకు ఉత్వము. వులోపము, ఉలోపము, దకారమునకు నకారాదేశము. నకార రేఫములకు నడుమ డకారాగమము.

ఇట్లే;

ముప్పండ్రు = మూడు + పది + వరు.

నలువండ్రు = నలు + పది + వరు.

ఏఁబండ్రు = ఏను + పది + వరు.

ఆఱువండ్రు = ఆఱు + పది + వరు.

డెబ్బండ్రు = ఏడు + పది + వరు.

ఎనుబండ్రు = ఎను + పది + వరు.

తొమ్మండ్రు = తొమ్మి + పది + వరు.

నూఱుగురు = నూఱు + వరు.

వేగురు = వేయి + వరు. యికారమునకు లోపము.

ఇట్లు ఇతరశబ్దములకు వ్యుత్పత్తులు ఊహ్యములు.

చంద్రికాప్రెస్సు, [illegible]పేట, మద్రాసు.—1948.